# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 1-9-1979 | సంచిక 21

→ ఈ సంచికలో ←



16—9—79 సంచికలో కావ్యహేతువులు, రాళ్ళపల్లివారి రచనా రమణీయకత, ఆచార్య యాస్క అప్పరస, విశ్వనాథవారి అద్భుతసృష్టి - కడిమిచెట్టు మొదలగునవి ఉంటాయి.

→ 1, 16 తేదీలలో ప్రచురింపబడును ←

చందా
సంవత్సరమునకు రు 10.00.
అర్ధ సంవత్సరమునకు రు 5.50.

విడిప్రతి 50 పై.

# శ్రీశ్రీ కవిత్వంలో హాస్యం

— రత్నశ్రీ (యస్. రాజశేఖర్, బి. ఏ.)



శ్రీ శ్రీ మహాకవి. ఆయన ఏది వ్రాసినా దానిలో ఒక ప్రత్యేకత, ద్యోతకమవుతుంది. 'మహాప్రస్థానం' 'ఖడ్గసృష్టి' లాంటి మహాకావ్యాలను సృష్టించి,అశేష ఆంధ్రజనుల్ని విశేషంగా ఆకర్షించాడు. శ్రీ శ్రీ కవిత్వంలో అభ్యుదయం ఉంది. ఆయన మాటల ఈటెలతో కవితను నిర్మిస్తాడు. హాస్యశీకరములతో రసహ్లాదమూల్ని మెప్పిస్తాడు, రంజింప చేస్తాడు. ఆయన, కవిత్వంలో హాస్యాన్ని లాస్యం చేయించగలడు. ఆయన విదూషక, శేక కార్టూన్ కవిత్వంలో కూడా సిద్ధహస్తుడు. ఆయన వ్రాసిన 'మూడు యాభములు, మరోమూడు యాభయిలు' ఈ విదూషక కవిత్వానికి చెందినవి. ఈ కవితలు వ్రాయడంలో ముఖ్యంగా, నవ్వించడమే కాకుండ, కవిత్వంద్వారా కార్టూన్లు నిర్వహించే విధిని నిర్వహించడము, హాస్యంతోపాటు నీతి, సైటర్, ఉపదేశాలు కూడా అందించటం ఆయన ఉద్దేశం. విప్లవకవిత్వంతో విసుగెత్తిన ప్రజాలోకానికి ఈవిదూషకకవిత్వ మొక హాస్య జలపాతం. వ్యంగ్యంగా, సమాజాన్ని మయ్యబట్టి కళ్ళు తెరిపిస్తాడు. శ్రీశ్రీ, హాస్యంకోసమే ఈ కవిత్వాన్ని వ్రాయలేదు. ఈవిషయం తెల్సుకోకుండా ఊరికే నవ్వేసి ఊరుకునే వాళ్ళు అఖరికి తామే నవ్వులపాలయి పోయారు. శ్రీశ్రీ

'నవరసాల నాయకుణ్ని
కవనం నా ఆయుధం
ఈ శతాబ్ది సేలుతుంది
బీభత్స రసాయనం'

అంటూ డొకచోట హాస్యానికి సాహిత్యంలో ఎప్పుడూ మంచిస్థానమే ఉందంటాడు.

'అనాడూ ఈనాడూ
హాస్యానికి విలువకద్దు
సాహిత్య సభాంగణాన
వ్యంగ్యానిదే మొదటిపద్దు'

అని ఎంతోముద్దుగా, హాస్యానికి ఒక హద్దు ఏర్పరిచాడు. ఆయనకు ఛందస్సు బందీ అయింది. అందం, ఆయనకు సొంతమైంది అందమైన ఆయన కవిత్వాన్ని అర్థం చేసుకోవడం అందరికీ సాధ్యం కాదు_ ఆయన కవిత్వాన్ని అర్థంచేసుకోడానికి కొంత కష్టపడాలి. అందంగా, మధురనిష్యందంగా, పరితృహ్యదయస్పందంగా, కందా లాకవంద రచించేందుకు ముందుకు వచ్చాడు శ్రీశ్రీ.

ఆయన_

'కుప్కాచ్ఛాందస కవిజన
ముష్కరులకు సొంటిపిక్క,
మూర్ధమ్మునకా యుష్కర్మము
తదుపరి కోచిష్కేకువ కప్పగింత'

ఆయన పదాలు Potent రసాలు Torrent

సత్ సమస్యకి Solvant శ్రీశ్రీ egiant.

స్వగతాన్ని ఎంత చక్కగా చెప్పుకున్నాడో నూడండి.

ఈవిదూషక కవిత్వంలో నీతి, ఉపదేశము, వ్యంగ్యం ఉండి మసృణ మంజులంగా, సుమకోమలంగా, హృద్యంగా, అనితరసాధ్యమైన రీతిలో భావాలను చిత్రించి 'సమాజాన్ని' ప్రతిబింబించారు.

కవిత్వం ఒకరు పురమాయిస్తే వచ్చేది కాదు. ఒకరు గదమాయిస్తే ఆగిపోయేదికాదు. అది జన్మతః రావల్సింది. అనేక వరం. కొంతమంది సాధనద్వారా సంపాదిస్తారు. కవితా, వనితలు తమంతటవే వలచి రావాలి, కాని వాటిని పట్టి తెచ్చినా, తెచ్చిపెట్టుకున్నా అందం, ఆనందం కల్గించవు కవిత్వం రావడానికి ప్రత్యేకమైన ఆహారం ఏమీలేదు. అదే చెపుతున్నాడు చూడండి చక్కగా.

'కప్పలను తెచ్చికొని రా
చ్చిప్పం బడవైచి, కండచీమలతో, కా
రప్పొండి, జల్లి, తింటే
చిప్పిల్లునె, కవనధార? సిరిసిరి మువ్వా!

కవిత్వం సహజంగా వస్తేనే సౌందర్యంగా ఉంటుంది కానీ అభ్యాసవల్ల వొచ్చింది అంతరక్తిగా ఉండదు. పద్య కవిత్వం వ్రాయడంలో, కొన్ని పద్యాలు వ్రాయడంలో కొంతమంది నిపుణులు.

సీసాన్ని వ్రాయటంలో శ్రీనాథుడు,
కందాన్ని అందంగా వ్రాయటంలో
తిక్కన
మత్తేభాన్ని నడిపించడంలో నన్నయ
ఆటవెలదిని వ్రాయడంలో వేమన
సిద్ధహస్తులు. అదేవిధంగా శ్రీశ్రీ కూడా కందాన్ని అందంగా వ్రాయగలడు.

'కందం తిక్కనగారిది
కుందవరపు వారి ముద్దుకుర్రని దంతే
అందరి తరమా కందపు
చిందులకిటుకుల్ గ్రహింప,సిరిసిరిమువ్వా!

అంటాడు మరొకచోట.

'నాలాగ కందబంధ
జ్వాలా జాలాగ్ర సంస్రవత్ సద్గీతా
లాలాపించే కవితా
శ్రీలోలుడు నహీనహీతి, సిరిసిరిమువ్వా!

శ్రీశ్రీ కవితారమణికి తన పదాలతో అమృతాభిషేకం చేసాడు. శ్రీశ్రీ కృతులు గతిలో శ్రుతిలో మహోన్నతివందుకున్నాయి. ఆయన పదాలలో ఒక తూగు ఉంది. అదికొండ వాగులాంటిది. సంపాదకుడంటే ఆయన కెంతో ఇష్టం ఎందుకంటే. చమత్కారంగా చెప్తాడు.

'సంపాదకుడంటే, నా
కింపారెడు భక్తిగలదు, ఎంచేతనగా
సంపూర్ణ మనుజు డాతడు
చింపాంజీకన్న నయము సిరిసిరిమువ్వా!'

ప్రాస కవిత్వానికి మంచి అందాన్నిచ్చే ఆభరణం, వ్యాకరణం కవిత్వానికి మెరుగులు దిద్దుతుంది, హద్దులు నిర్ణయిస్తుంది. కేవలం వ్యాకరణ యుక్తంగా, వ్రాసినా కొన్నిపద్యాలు (కవితలు)మనోహరంగా ఉండకపోవచ్చు.

'భాష కొక స్థాయినిచ్చే
ప్రాస లలంకృతులు యతులు
వ్యాకృతులయ్యో
పైసొగసు పూతకైతే,
చేసేదేమున్న దింక? సిరిసిరిమువ్వా!'

సుకవి కుకవులకు భేదం ఎలా ఉంటుందంటే –

'వ్యాకరణం తోకపుచ్ఛకు
కాకవులూరేగుతారు, కానీ సుకవుల్
వ్యాకృతి ఆకృతి మార్చే
సేకావ్యా లల్లగలరు సిరిసిరిమువ్వా!'

'శ్రీశ్రీకి మాస్కో వెళ్ళగలిగే ఆస్కారం ఉన్నా లేకున్నా వెళ్ళక జీవితాన్ని సుఖంగా విస్కీ తాగుతూ గడిపెయ్యగలడు.

'మాస్కోకు వెళ్ళగలిగే
ఆస్కారం లేకపోయినప్పటికైనన్
విస్కీ సేవిస్తూనే
శ్రీస్కీనై బతకగలను సిరిసిరిమువ్వా?'

కొద్దిపాటి భాషాజ్ఞానంతో, కవిత్వం వ్రాస్తూ తామెంతో గొప్ప ప్రతిభావంతుల మని చెప్పుకునేవాళ్ళంటే శ్రీశ్రీకి గొప్ప చిరాకు.

'పెదబాలశిక్ష చదివీ
చదవడమే తడవుగాగ, సాహిత్యవిశా
రదులయినట్లుగ, భావిం
చెదరుగదా, కొంతమంది సిరిసిరిమువ్వా!'

ఎవరిగొప్పవాళ్ళు చెప్పుకుంటూ,సొంత డబ్బా వాయించుకుంటూంటే శ్రీశ్రీకి ఒళ్ళుమంట.

'మేం గొప్పవాళ్ళమంటూ
సంగీతం, తీయునట్టి చవటల నెల్లన్
బంగీకట్టి పయోరా
శిం గూలగద్రోయవలదె సిరిసిరిమువ్వా!'

ఈరోజుల్లో 'జీడికి' రాజెవరంటే.

'బీడీలు కాల్చుకుంటూ
గాడిదలను తోలుకొంటు, కసరత్ చేస్తూ
పాడుకొను నెవడు వాడే
జీడికి రాజగును నేడు సిరిసిరిమువ్వా!'

కొన్ని వేమన, బద్దెనల పద్యాలకు శ్రీశ్రీ చక్కని 'పారడీలు' వ్రాసాడు. అవి ఆధునిక కాలానికి సరిగ్గా సరిపోతాయి.

'కోయకుమీ, సొరకాయలు
వ్రాయకుమీ, నవల లని అవాకు చెవాకుల్
డాయకుమీ, అరవఫిలిం
చేయకుమీ, చేబదుళ్ళు సిరిసిరిమువ్వా!'

సరదాగా చెప్పినా అందులో సత్యం లేకపోలేదు. వ్యంగ్యముంది, కవితా సౌందర్యముంది. కొంతమంది తాము భార్యల యెదుట నోరువిప్పి మాట్లాడలేరు. వీధిలో పెద్ద ధైర్యవంతులు. ఇంట్లో పిల్లిపిల్లలు. అలాంటివాళ్ళని చూసి, ఏమంటాడంటే–

'బారెట్లా అయితే సాం
బారెట్లా చెయ్యగలడు, భార్యఎదుట, తా
నోరెట్లా మెదలించును
చీరెట్లా బేరమాడు సిరిసిరిమువ్వా!'

ఆహార్యం మార్చినంతమాత్రాన, సామాన్యుడు రాజు కాలేడు. గాడిదకు గంతలు కట్టినంతమాత్రాన గుర్రం కాజాలదు. అదేవిధంగా

'గానుబనాయిస్తే, దొర
సానిగ, గడసాని మారజాలునె? ఖాదీ
తానులు, సైతాలు, ధరి
స్తే, నాయకు డెట్టులవును? సిరిసిరిమువ్వా!'

ఈనాడు 'రామాయణం' వ్రాయడం చాలామందికి ఫ్యాషనైపోయింది. మళ్ళీ మళ్ళీ రామాయణం వ్రాయడం కంటే రామకోటి వ్రాయడం నయం అంటాడు శ్రీశ్రీ. మానవప్రవృత్తి ఎలా ఉంటుందంటే 'దూరపుకొండలు నునుపు' అన్న సామెత రీతిగా.

'కనిపించని మాధవుణ్ని
కాన్కలతో కొలుస్తాడు
కనిపించే మానవుణ్ణి
కాలరాయ దలుస్తాడు'

ఈరోజులు, రోజాలా, తాజా కాజాలా, కావు. మరి?

'ఈ దినాలు, సుదినాలా
చేదుచేదు దినాలా ?
మాధుర్యం, సౌందర్యం
లేదు లేదనలా ?

శ్రీశ్రీని 'ముసలివాడని' ఎవరైనాఅంటే
ఏమంటాడో తెలుసా ?
'నేను
ముసలివాణ్ణి కాను
అసలువాణ్ణి
పడగెత్తిన తాచుపాము, బుసలవాణ్ణి
పిడితుల్ని వెంటేసుకు, మసలువాణ్ణి
అందుకున్న ఆకాశపు కొసలవాణ్ణి.'

అసలే అనేక సమస్యలతో సతమతమౌతున్న ప్రజలకి కవిసమ్మేళనా లొక 'సమస్య' కారాదు. అందుకే ఏమంటాడంటే –

'సమ్మెల వేళ
కవిసమ్మేళ
నాలేల, ఓరోరికూళ
వినరా దిగంతరాళ
కరాళ దిగంబర గ్రీవమేళ.'

నేటి 'సినిమా'లపై చక్కనివిమర్శ,

'నీతి నీమా
ల్లేని సినిమా
ముందు ప్రణామా
లెందుకురా? అది మనీ, మా
ర్కెట్ ఎనీమా ?'

లేనిపోని అందాన్ని తెచ్చిపెట్టుకునే పిచ్చివాళ్ళని చూసి ఏమంటాడంటే –

'మీసాలకు రంగేదో
వేసేస్తే యౌవనం లభించదు, నిజమే !
సీసా లేబిల్ మార్చే
స్తే సారా బ్రాందియగునె? సిరిసిరిమువ్వా!

భావకవికి సిగ్గు అనవసరం అంటాడు ఈ క్రింది పద్యంలో –

'ఉగ్గేల త్రాగుబోతుకు ?
ముగ్గేలా, తాజమహలు మునివాకిటిలో !
విగ్గేల కృష్ణశాస్త్రికి
సిగ్గేలా భావకవికి? సిరిసిరి మువ్వా ?

ఇంగ్లీషు పదాల్ని తెలుగుపదాలతో మిళితంచేసి, కొన్ని గమ్మత్తులు చేస్తాడు.

'Gold వ్యామోహం, చెడ్డది
Mild వ్యాయామం, శరీరమాద్యం
ఖిలుండా!
Child వ్యాపారం, కూడదు
Old వ్యాహోల్డు చేయకో సిరిమువ్వా!'

మరొకటి –

సింహాలకు Zoo లుండును
సంహారమె సృష్టియగును సామాన్యముగా
అంహాస్సెయాను పుణ్యము
Some how మనకవన మిట్లె ప్రవి
యించు సిరీ.

యుద్ధాలు ఎప్పుడూ ఉన్నాయి, ఉంటాయి. అవి అనివార్యములు.

'యుద్ధం పోతేనే ? వా
క్యుద్ధాలూ, కాగితాల యుద్ధాలూ, లో
కోద్ధరణ, పేరమళ్ళా
సిద్ధమురా, కుందవరపు సిరిసిరిమువ్వా !

కవిత్వం కానిదాన్ని కవిత్వం అంటే శ్రీశ్రీ సహించడు.

'బండెడు చెత్తను ఛంద
శ్ఛందముగా ప్రోగుచేసి స్వారస్యము,చూ
డండని కోతలు కోస్తే
చెండాడెద నట్టివారి, సిరిసిరిమువ్వా!

పూర్వం' నాన్ ఋషిః కురుతేకావ్యం' అన్నారు. ఇప్పుడు నినాదాలు కవిత్వంగా చెలామణి అవుతున్న దినాలు.

'ఓ అంతా కవులే అ
ఆ,ఇ,ఈ లైన, రానియంబ్రహ్మలె, మే
మూ ఋషులం అన, ఛీ ఛీ
ఛీ, ఎంతటినవ్వుబాటు సిరిసిరిమువ్వా!!

మన తెలుగు కవుల్ని ఎన్నో బిరుదులతో సత్కరిస్తారు. కవివృషభం, కవిదిగ్గజం, కవి మత్తేభం.

'అవురా మన తెలుగింట్లో
కవిరాజులు, కవి, వరాహ గార్దభ, శునకా
ద్యవతారమూర్తు లెందఱో
శివమెత్తి నటుల్ నటింత్రు సిరిసిరిమువ్వా!

సుమతీ శతకంలో ఒక పద్యానికి అనుకరణ ఇది.

'ఎప్పుడు పడితే అప్పుడు
కప్పెడు కాఫీ నొసంగ గలిగిన సుజనుల్
చొప్పడిన యూరనుండుము
చొప్పడకున్నట్టియూరు చొరకుము
మువ్వా–'

శ్రీశ్రీ 'ఖాంటెకోణాలు' చదివితే నవ్వురాక మానదు. కొన్ని వాక్యాలు చూడండి, అర్థంవున్నా లేకున్నా ఏదో పదాల గారడీచేసి, మనల్ని మంత్రముగ్ధుల్ని చేస్తాడు. ఏదో చెప్తున్నట్లు తనవైపు త్రిప్పుకుంటాడు.

కటకటా, లొటిపిటా చస్తే
కృ. శా. విషాదకావ్యం వ్రాయాలా ?
Sex లో 'x' కర్థం తీస్తూ
చలం కలంపట్టుకోవాలా ?"
జీబ్రాకి algebra చిహ్నాల
లాంకోటూ, పాంకోళ్ళూ తొడిగి
సాహిత్య పౌరోహిత్యం ఇస్తే
వెర్రికాదు Sarrealism
రా, సోదరా."

'చేదుపాట' కవితలో –

"మనదీ ఒక బ్రతుకేనా ?
కుక్కలవలె, నక్కలవలె
మనదీ ఒక బ్రతుకేనా ?
సందులలో పందులవలె !!

చదువు,బ్రతుకు,కవిత ఎలాంటివంటే–

'చదువు మాయ
బ్రతుకు ఛాయ
కవిత కరక్కాయ.'

'సిరిసిరిమువ్వ శతకం' చదివిన వారికి 'ఫలం' ఏమిటంటే–

'ఈ శతకం యెవరైనా
చూసి, చదివి, వ్రాసి, పాడి సొగసిన
సిగరెట్
వాసనలకు కొదవుండదు
శ్రీశకరుణ బలిమివలన సిరిసిరి మువ్వా."

—•••—

 

# మనకర్ణుని కథ



— శ్రీ భారతీప్రియ.



మహాభారతం చదివినపుడుగాని విన్నపుడుగాని, నాటకంగానో, సినిమాగానో చూసినపుడుగాని, మన మనస్సు సాధారణంగా కర్ణునిమీద లగ్నమవుతూ ఉంటుంది. భారతకథలో ధర్మపక్షాన్ని కృష్ణుడు ద్రౌపది పాత్రలు ఎలా మనల్ని ఆకర్షిస్తాయో అధర్మపక్షాన్ని దుష్టచతుష్టయం మనల్ని అలా ఆకర్షిస్తుంది. దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని ఈనలుగుర్నీ దుష్ట చతుష్టయం అంటారు. వీరిలో తతిమ్మా ముగ్గురికంటె కర్ణుని వ్యక్తిత్వము కొంతవరకూ విశిష్టమైంది. సాధారణ దృష్టిగల సజ్జనులుకూడా కొందరు భారతంలో కర్ణుడికి అన్యాయం జరిగిందని వాపోతూ ఉంటారు. మరికొంత మంది అతని బలహీనతలే పతనానికి కారణమని, నిజంగా వ్యక్తిత్వంలో అయితే మాత్రం ఏలోపంలేని వాడని అంటూ ఉంటారు. ఈవిధంగా ఇప్పటి కాలంలో దుర్యోధనాదులకంటె కర్ణుని మీద జనంలో సానుభూతి ఎక్కువగా ఉంది. దానికి –

(1) పుట్టినప్పుడే కుంతి అతనిని పెట్టెలోపెట్టి గంగలో వదలివేయడం.

(2) కుమారాస్త్ర విద్యా ప్రదర్శన వేళ కృపాచార్యులు కుల ప్రసక్తి తీసుకొచ్చి కర్ణుణ్ణి అవమాన పరచటం.

(3) పరశురాముడు అస్త్ర విద్య అంతా నేర్పినప్పటికి 'సమయానికి జ్ఞప్తికి రాకుండుగాక!' అని శపించటం.

(4) భూదేవి యతని రథ చక్రము యుద్ధంలో భూమిలో కూరుకుపోతుం దని శపించటం.

(5) ఇంద్రుడు కపట బ్రాహ్మణ వేషంతో వచ్చి కవచ కుండలాలు యాచించి పట్టుకొని పోవడం.

(6) భీష్ముడు అతణ్ణి అర్ధరథుడిగా నిర్ణయించడం.

(7) శల్యుడు సారథిగా కుదరడం.

– మున్నగునవి ప్రధాన కారణాలు.

మరి వీటికి పోటీగా అతని వ్యక్తిత్వంలో ఉండకూడని లోపాలుకూడ కొన్ని కన్పిస్తాయి.

(1) సాక్షాత్తు అవతారపురుషుడైన పరశురామునితోనే తాను బ్రాహ్మణుడనని అసత్యమాడడం.

(2) పరశురాము నొద్ద శపింపబడి దుర్యోధనునితో ఆమాట చెప్పక అస్త్ర విద్య అంతా నేర్చితి నని చెప్పడం.

(3) ద్రౌపదీ పరాభవవేళ ఆమెను సభలోనికి వివస్త్రను చేసి తెచ్చినా తప్పులే దని పలుకడం.

(4) అభిమన్యు వధకు పూనుకొని తానే వంచనతో వెనుకనుండి విల్లు విరవడం.

(5) సూర్యుడు వచ్చి చెప్పినప్పటికి తన ప్రాణమిత్రుడైన దుర్యోధనుని కోసం అని అయినా ఆలోచించకుండా కేవలం దానకర్ణుడనే తన కీర్తికోసం ఇంద్రుడికి కవచకుండలాలు దానం యివ్వడం.

(6) కుంతీదేవికి పాండవులు నలుగురు చేజిక్కినా చంపనని మాట ఇవ్వడం.' మున్నగునవి ఉన్నవి.

ఈ పైవిషయాలన్నీ వాటికవి చర్చింపకుండా మొత్తం కర్ణుని జీవితం ఆవిధంగా విధిచేత నిర్ణయింప బడడంలో గల అంతరార్థాన్ని మనం పరిశీలిస్తే భారత కథా పరమార్థంలో కర్ణుని వ్యక్తిత్వం మనకు అర్థం అవుతుంది. ఈవ్యాస శీర్షిక పేరు "మనకర్ణుని కథ" అని పెట్టడంలో కూడ ఈ భారత రామాయణాలలో చెప్పిబడిన కథాంశాలన్నీ మన జీవితంలో జరుగుతున్న వనే సమన్వయ దృష్టితో జరిగిందిది. మన శరీరంలో, మన జీవితంలో ఏం జరుగుతోందో మనం తెలిసికోగలిగితే భారత రామాయణాలే కాదు. ఈ సృష్టిలోని సమస్తజ్ఞానము అనుభవానికి తెచ్చుకో గలుగుతాం. ఇదే పిండాండ బ్రహ్మాండ సమన్వయము. మన మహర్షులు సమాధి స్థితిలో నుండి బ్రహ్మజ్ఞానము పొందిన పద్ధతి ఇదే. ఇపుడు మనకర్ణుని కథలోకి వద్దాం.

మహాభారత కథలో పంచపాండవులు పంచేంద్రియాలకూ, ద్రౌపది మనస్సుకూ, శ్రీకృష్ణుడు ఆత్మకూ సంకేతమనీ, దుర్యోధనాదులు అహంకారాదులకు సంకేతమనీ స్థూలదృష్టికి కనిపిస్తూనే ఉంది. ఈకథలోని ఇతర విషయాలన్నీ మొత్తం సమన్వయించుకుంటే భారత కథా పరమార్థం బోధపడుతుంది. సాధారణంగా మనం మొదట పుట్టుకతో అజ్ఞాన స్థితిలో ఉండి దేహభావం కలిగిఉంటాం. కాలక్రమంలో జ్ఞానం సంపాదించి మనం "దేహం" కాదు అని తెలిసికొని దేహభావం విడిచిపెడతాం. ఇందులో పూర్వస్థితిని పుట్టు గ్రుడ్డియైన ధృతరాష్ట్రుడుగా, ఉత్తర స్థితిని కొద్ది కాలానికే మరణించిన పాండురాజుగా చెప్పారు. ధృతరాష్ట్రుడు అంటే–'ధృత= ధరింపబడిన, రాష్ట్ర = శరీరము కలవాడు" అని అర్థం. అంటే శరీరము ఇవ్వబడినవాడు. అందువల్లనే కథలో పాండురాజు అన్నగారికి రాజ్యం కట్టబెట్టినట్లు చెప్పబడినది." పాండురాజు అంటే – తెల్లని స్వచ్ఛమైన జ్ఞానస్వరూపుడై ప్రకాశించేవాడు" అని అర్థం. అలా జ్ఞానం పొంది దేహభావం విడిచిన జీవుడు తన ఇంద్రియాలను పరమాత్మకే

అప్పగించిన వాడగు చున్నాడు. పాండు రాజు పాండవులను కృష్ణునికి అప్పగించాడని చెప్పబడింది.

ఈ విధముగా జీవుడు జ్ఞానస్థితిని పొందడంలోని క్రమపద్ధతికూడ ఇందులో చెప్పబడింది. జ్ఞానం పొందక ముందు ఉన్న ప్రకృతి ఒకటి. జ్ఞానం పొందిన తరువాత ప్రకృతి మరొకటి. పూర్వ ప్రకృతితో జీవుడు ఇంద్రియ సుఖాలను అనుభవిస్తాడు. ఇదే పూర్వ భార్య అయిన కుంతి యందు ఆయా దేవతల వర ప్రభావంచేత ధర్మజ భీమార్జునులను పొందడం. రెండవ ప్రకృతితో కూడ పూర్వంలాగానే ఇంద్రియ సుఖాలను అనుభవించటమే మాద్రితోకూడ సంతానాన్ని కనడం. అయినప్పటికి రెండవ ప్రకృతి (స్వభావం) జ్ఞానంతో కూడినది కనుక దేహభావంతో అదికూడ అంతరిస్తుంది. ఇదే పాండురాజుతో మాద్రి సహగమనంగా చెప్పబడింది. మొట్టమొదట జీవుని ప్రకృతి సహజంగా స్వచ్ఛంగా ఉన్నప్పుడు పరమేశ్వరుడు ఒక గురువు రూపంలో దర్శనమిచ్చి పరమాత్మ అనుగ్రహానికి పాత్రులు కావడానికి తగిన మంత్రోపదేశం చేస్తాడు. ఇదే ఈశ్వరాంశజుడైన దుర్వాస మహర్షి కుంతికి మంత్రోపదేశం చెయ్యడం. అప్పటి పరమాత్మ అనుగ్రహమే సూర్యుని అనుగ్రహంవల్ల కర్ణుని పుట్టుక. ఆజీవ ప్రకృతియొక్క స్వచ్ఛతయే కుంతి కన్యాత్వముగా చెప్పబడింది. మనయొక్క నిర్మలత్వం భగవదనుగ్రహం పొందిన తరువాత మారదు గనుక కన్యాత్వం ఏమాత్రం చెడదు. అని చెపుతారు.

కర్ణుడు సహజ కవచకుండలాలు కలిగి పుట్టాడు. సూర్య తేజస్సుతో ప్రకాశిస్తూ ఉన్నాడు. సూర్యునివల్ల భూమిమీద ప్రకృతియందు జీవులు పుట్టడమే సూర్యునివల్ల కర్ణుడు పుట్టడం. జీవుడు వాస్తవానికి ఆత్మస్వరూపుడు. ఇదే సూర్య తేజస్సుచే ప్రకాశించడం. అతనికి సహజ కవచం అంటే ఆత్మకు పుట్టుకతో కలిగే దేహం. కుండలాలు చెవి ఆభరణాలు. కనుక జ్ఞాన స్వరూపాలు. చెవి జ్ఞానాన్ని శబ్దరూపంలో గ్రహించేఅంగం. కనుక ఈ విధంగా ఆత్మస్వరూపుడైన జీవుడు సహజ దేహంతో సహజ జ్ఞానంతో పుట్టడమే కర్ణుడు సహజకవచకుండలాలతో పుట్టుట. ఇటువంటి జీవికి ప్రకృతియే సహజరక్షణ కల్పించి కాలప్రవాహంలో విడిచిపెట్టుతుంది. పాంచభౌతికమైన శరీరమునకు, పాంచభౌతికమైన ప్రకృతి ఈ రక్షణ కల్పిస్తోంది. ఈ రక్షణయే కుంతికర్ణుణ్ణి పెట్టెలో పెట్టడం, కాలప్రవాహంలో విడువడమే గంగలో విడువటం. స్థూలదృష్టికి అయ్యో! పెట్టెలో పెట్టి గంగలో విడిచింది. కన్నతల్లి అనుకుంటాంగాని నిజంగా 'ఏ పసి కందునైనా పెట్టెలో పెట్టి మూతపెడ్తే ఎంతసేపు బతికి ఉంటుంది గనుక. అందువల్ల రక్షణకోసం సూర్యుని అనుగ్రహం చేతనే గంగలో కొట్టుకొని వచ్చిన ఆ పెట్టె పరమాత్మ అనుగ్రహం చేత కాలప్రవాహంలో మన కివ్వబడ్డ రక్షణే అని తెలుస్తుంది. మరి మన విషయంలో ఈ రక్షణ అనే పెట్టె అదృశ్యంగా ఉంది కదా అనిపిస్తుంది కర్ణుడు విషయంలో కూడా అతడు పసిబాలుడు కనుక రక్షణ ఉన్నది అన్న భావం తప్ప తనని పెట్టెలో పెట్టారు అన్న భావం అతనికి ఉండదు.

గంగా ప్రవాహంలో కొట్టుకొనివచ్చి ఆ బాలుడు సూతునికి దొరికాడు. అంటే కాలప్రవాహంలో జీవుడు పెరిగి పెద్దవాడై దేహభావం పొందుతున్నాడని భావం. సూతుడు అంటే రథంతోలి జీవయాత్ర గడుపుకొనువాడు (శూద్రుడు) అని అర్థం. ఈ శరీరాన్నే రథం అంటారు. దేహం పోషించుకుంటూ జీవయాత్ర సాగించే వ్యక్తిని సూతపుత్రుడు (శూద్రధర్మము ననుసరించి జీవించువాడు) అంటారు.

ఇలా కొంతకాలం జరిగే సరికి కర్ణుడు పాండవ కౌరవులకు సమానుడై అన్ని విద్యల్లో ఆరితేరినాడు. అపుడు కుమారాస్త్ర విద్యాప్రదర్శనం జరిగింది. అందులో అర్జునుడు అందరిచేతా ప్రశంసలు పొందాడు. భారతకథ అంతా యోగపరమార్థంగా మనశరీరంలో జరుగుతున్నప్పుడు మనం అర్జునుని పాత్రవహించి ఉంటాం. దానికి ప్రతినాయక స్థితి కర్ణునిపాత్ర. అందువల్లనే కుమారాస్త్ర విద్యా ప్రదర్శనంలో కర్ణుడు అర్జునుడు సాటికారని నిరూపింపబడింది. ఇక్కడ స్థూలదృష్టికి కులప్రసక్తి తెచ్చి కర్ణుణ్ణి అణచివేసినట్టు కన్పిస్తుంది. కాని యిందులోని పరమార్థం తెలిస్తే ఆ పొరపాటు పడం. అర్జునుడు పాండురాజుకి కుంతికి పుట్టిన రాజ్యార్హతగల రాజకుమారుడు. అంటే జ్ఞాని అయిన జీవుడికి అతని ప్రకృతి యందు పుట్టి దేహమును ధరించు జీవుడు. మరి కర్ణుడు స్వచ్ఛమైన పరమాత్మకు పుట్టినప్పటికి ఆ సత్యము తెలియక సూతపుత్రుడై దేహభావమును కలిగియున్న జీవుడు. కనుక ఇతనికి దేహాన్ని పాలించే అధికారం లేదు. తాను దేహంకంటే వేరని, ఆత్మస్వరూపుడనని గుర్తించిన వాడు దేహాన్ని రంజింపచేయగలవాడవుతాడు. దేహమే తాననుకొనే అజ్ఞాని దేహంపై అధికారంలేక ఇంద్రియ సుఖాలకు తనను తానే బలిపెట్టుకుంటాడు. అలాంటివాడు దేహాన్ని ఎలా రంజింపజేయగలుగుతాడు. అర్జునుడికి కర్ణుడికి ఇంత తేడా ఉంది. అసలు విషయం ఇదిగాని కులప్రసక్తిగాదు. నేటివిమర్శకులు కొందరు కులపక్షపాతంతో కర్ణుడికి అన్యాయం జరిగింది అని విమర్శిస్తుంటారు. కర్ణుడు తన జన్మవృత్తాంతం తెలియనివాడవటంచేత క్షత్రియత్వాన్ని కోల్పోతాడు. మనం కూడా పరమాత్మ అంశమే అని తెలుసుకోలేక పోవడంచేతే గదా దేహాధి

కారాన్ని పొందలేక పోతున్నాం. అందువల్లనే అంగరాజ్య పట్టాభిషేకం వల్ల ప్రయోజనం లేకుండా పోయింది. అంగరాజ్యం అంటే మన దేహమే. రాజ్యార్హత లేనివ్యక్తికి రాజ్యం కట్టబెడితే మాత్రం ఏం ప్రయోజనం? వాడు రాజౌతాడా? ఇది దేహాధికారం లేని వ్యక్తికి దేహం యిచ్చినట్టవుతుంది. స్త్రీత్వం లేనిదానికి చీరకట్టినట్టౌతుంది. ఆవ్యక్తి ఎవరిని రంజింపజేయగలుగుతుంది. అందులోనూ అంగరాజ్యం యిచ్చింది దుర్యోధనుడు. అంటే జీవుని అహంకారం. అహంకారం చేతనే ఒకవ్యక్తి దేహమే తాననుకుంటాడు. నిజానికి ఆ అహంకార తత్వానికి కూడ దేహం మీద అధికారంలేదు. రాజ్యానికి రాజు ధృతరాష్ట్రుడు. యువరాజు ధర్మరాజు. కనుక దుర్యోధనుడిది వట్టి అహంకారపు చలాయింపే. కనుకనే 'ఒక దురహంకారి స్త్రీత్వం లేనివానికి నేను చీర కట్టబెడుతున్నాను.' అని కట్టబెడితే ఏమాత్రం ప్రయోజనం ఉంటుందో అంగరాజ్య పట్టాభిషేకం వల్ల కూడా కర్ణుడికి అమాత్రం ప్రయోజనమే దక్కింది. అంటే పరువు దక్కిందిగాని ప్రయోజనం కలుగలేదు. అందువల్లనే అప్పటినుండి అర్జునుడితో స్పర్ధఏర్పడింది.

ఆస్పర్ధతోనే అతడు జీవితమంతా అర్జునుడితో విరోధం పెంచుకోడానికి కృషి చేశాడు. ద్రోణాచార్యులు అర్జునుడికి నేర్పినట్లుగానే తనకూ బ్రహ్మాస్త్రం మొదలైనవి నేర్పుతాడేమో అని అడిగి చూశాడు. లాభంలేకపోయింది. బ్రాహ్మణుడో, క్షత్రియుడో అయితే తప్ప నేర్పనన్నాడు. ఇంక ఏమిటి గతి. అర్జునుడిమీద పగ సాధించటం తప్ప మరేమీ జీవితలక్ష్యంగా కనిపించని కర్ణుడికి అబద్ధం ఆడటం తప్ప మరేమీ దారి దొరకలేదు. అందుకే పరశురాముడి దగ్గరకు వెళ్ళి తాను బ్రాహ్మణుణ్ణి అని అస్త్రవిద్య నేర్చుకున్నాడు. ఈ విషయం కర్ణుడు అబద్ధమాడి వ్యక్తిత్వం చెడగొట్టుకోవటమే కాకుండా అవతార పురుషుడైన గురుమూర్తి దగ్గర, స్వార్థంకోసం అసత్యమాడి స్వవినాశనంకోరి తెచ్చుకున్నాడు. గురువు అంటే 'సాక్షాత్తు దేవుడే అలా దిగివచ్చాడు.' అన్న భావం ఉండాలి. కర్ణుడికి ఆభావం ఉంది. అందుకే ఆశ్రయించాడు. కానీ లేదు. అందుకే ఆయనవద్ద అసత్యమాడాడు. సామాన్య గురువు కూడా శిష్యుడి వ్యక్తిత్వాన్ని, సత్యసంధతని కనిపెట్టలేనంత చవట అయి ఏమీ ఉండడు. ఇంక అవతారమూర్తి మాట చెప్పేదేముంది. ఆయన అంతకళ్ళుమూసుకుని నిద్రపోతున్నాడా? కర్ణుడి మోసం తెలియక పోవడానికి. అతని అసత్యనటన అతనిచేత చెప్పించటానికే పరశురాముడు శిష్యుడి తొడమీద నిద్రపోయాడు. ఇంతలో ఇంద్రుడు కుమ్మరి పురుగైవచ్చి కర్ణుడి తొడక్రింద తొలుచుట మొదలుపెట్టాడు. అలా అక్రమంగా అతని తొడ తినివేస్తున్నా గురునిద్రా భంగం అవుతుందని కర్ణుడు చలించలేదు పాపం! గురువంటే శిష్యుడి దేహాన్ని బలికోరేవాడని అతని అభిప్రాయం కాబోలు! గురువంటే జ్ఞాన స్వరూపం. శిష్యుడంటే సాధకుడైన జీవుడు. జీవులయందు జ్ఞానం నిద్రాణస్థితిలో ఉంటుంది. అపుడు మనల్ని ఇంద్రియసుఖం కుమ్మరి పురుగులా తొలిచేస్తుంది. ఆసమయంలో మనం అహంకారాన్ని ధైర్యం అని పొరపడితే ఆత్మవినాశానికి దారి తీస్తుంది. కర్ణుడి విషయంలో అంతే జరిగింది. ఇంద్రియ బాధచేత దేహం దెబ్బతిన్నప్పుడు వెంటనే మనం మనలో నిద్రాణమై యున్న జ్ఞానాన్ని మేల్కొల్పాలి. అపుడది మనల్ని రక్షిస్తుంది. అలాకాక కర్ణుడిలా పొరబడితే "ఆలస్యాదమృతం విషం" అన్నట్లు ఆ జ్ఞానమే ఆలస్యంగా మేల్కొంటుంది. అపుడేం చేసినా చేతులు కాలినాక ఆకులుపట్టుకున్నట్టవుతుంది. అందుకే పరశురాముడు మేల్కొని నువ్వు ఈ రక్తపాతాన్ని సహించ గలిగావంటే బ్రాహ్మణుడివి కాజాలవు. క్షత్రియుడివై యుంటావని దివ్యదృష్టితో సత్యం తెలుసుకున్నాడు. కర్ణుడు ధర్మవిరుద్ధంగా అర్జునుడితో ఈపగ సాధించడానికి ఈ అసత్యమాడినట్లు గ్రహించి తాననుగ్రహించిన అస్త్రవిద్య అంతా అసత్యమౌతుందనీ, యుద్ధంలో వినియోగ పడదనీ శపించాడు. తనను తాను సంపూర్ణంగా ఆత్మార్పణం చేసుకుంటే ఆయన అనుగ్రహంగా విద్యలభిస్తుంది కాని ఆయనతోటే అసత్య మాడితే మనం నేర్చుకున్నా మనుకున్న విద్యకూడా అసత్యమై పోతుంది. బ్రహ్మజ్ఞానం గలిగిన బ్రాహ్మణుడు తనకు ఇంద్రియబాధ కలిగిన వెంటనే జ్ఞానాన్ని మేల్కొల్పుతాడు. క్షత్రియుడు బ్రాహ్మణుడివల్ల బ్రహ్మజ్ఞానం నేర్చుకొన్నప్పటికీ కామక్రోధాలకు లోనై యుద్ధంచేస్తాడు. కనుక క్షత్రియుడికి బ్రహ్మజ్ఞానం ఒంటబట్టదు. ఎందుకంటే యుద్ధంలో మరణించినా ఫరవాలేదుఅని దేహాభిమానం లేనట్లు కనిపించినా విజయం సంపాదిస్తాననే గర్వాభిమానాలు అంతకంటే ఎక్కువగా ఉంటాయి. అందువల్ల వాళ్ళ ధైర్యం అవివేకమే గాని ఆత్మజ్ఞానం మేల్కొనడం కలిగినదికాదు. కర్ణుడి ధైర్యం ఇటువంటిదే గనుక పరశురాముణ్ణి మోసగించబోయి తానే మోసగింపబడ్డాడు. ఇది ఇలా ఉండగా ఈ ఘోరాన్ని అంతనీ కప్పిపుచ్చి తన ప్రాణ స్నేహితుడైన దుర్యోధనుడి దగ్గరకు వెళ్ళి పరశురామునివద్ద అస్త్రవిద్య నంతనూ అభ్యసించివచ్చానని అసత్యమాడి కర్ణుడు తనవ్యక్తిత్వాన్నే మరింత కోల్పోయాడు. తనను నమ్ముకొన్న ప్రాణమిత్రునివద్ద చేయదగిన పనియేనా

ఇది. ఇది ఎలాంటిదంటే పరీక్షకు వెళ్ళే విద్యార్థి నేను ప్రశ్నలన్నింటికీ జవాబులు క్షుణ్ణంగా చదివాను అని అహంకారంతో చెప్పడం లాంటిది. చదివితే ఏం లాభం పరీక్షలో సమయానికి గుర్తు రావద్దా? మరి దేహభావంగల వ్యక్తికి మిడిమిడి జ్ఞానం అతని అహంకారాన్ని మోసగించే విధం ఇలాగే ఉంటుంది.

వెనుక కుమారాస్త్ర విద్యాప్రదర్శనము వేళ కర్ణుడికి అర్జునుడితో స్పర్థ ఏర్పడింది. అపగ ఎలా తీర్చుకోవాలా అని అదనుకోసం ఎదురు చూస్తున్నాడు. ఆ అవకాశం సభలో ద్రౌపదీ పరాభవ వేళ లభించింది. ద్రౌపదిని ఎలా పరాభవం చేయాలా అని ఆలోచిస్తున్నప్పుడు, ద్రౌపది రజస్వలను, ఏకవస్త్రను నను మట్టకు మని ప్రాతికామిని సభకు మరల పంపించినపుడు ఆమెను విగతవస్త్రను చేసి తెచ్చినా ధర్మవిరోధం లేదని పలికి వస్త్రాపహారణమును ప్రోత్సహించాడు. ఇది అతని వ్యక్తిత్వానికి ఏపాటి సభ్యత? పైకి దుర్యోధనుడు ప్రాణస్నేహితుడు గనుక ఆతని ముఖప్రీతికి అనిపిస్తుంది. అసలు రహస్యం వేరేఉంది. అదేమిటంటే అర్జునుడితో పూర్వం నుండీ ఉన్న స్పర్థ. ఆకసి యిప్పుడు అర్జునుడి భార్యకావడం వల్ల ద్రౌపది మీద వెళ్ళగ్రక్కాడు. ద్రౌపదీ వస్త్రాపహారణం అంటే మనస్సులలోని చిత్రవిచిత్రమైన కోర్కెలన్నింటినీ బైట పెట్టడం. పరమాత్మయొక్క సంకల్పం అనబడే మహాకామంతో కూడిన ఆత్మాంశమే జీవులయందు మనస్సుగా పనిచేస్తూ ఉంటుంది. కనుక ఇది కోరికల పుట్ట. ఇదే అనేక వస్త్రాలుగా చెప్పబడ్డాయి. ఈ మనస్సు సృష్టి ధర్మాన్ని అనుసరించి ఇంద్రియాలతో ప్రవర్తించడమే ధర్మజాది పంచపాండవులకు భార్యగా ఉండడం. మనకు దానిపై అధికారంలేదు. కాని జీవుడు అహంకారముతో మంచిని ప్రబోధించే మనస్సును లెక్క చేయకుండా ప్రవర్తించి తను ఆడించే ఆటలో ఓడిపోయిన దాసిగా భావింపజూస్తాడు. ఈ విధంగా అహంకారి తన మనస్సుని తానే బాధించుకుంటాడు. ఇలా బాధపెట్టుకొనే కోరిక దుష్టమైందీ, తీవ్రమైందీ కనుక దుశ్శాసనుడు అని చెప్పారు. మనస్సులో చెప్పకూడని కోరికలుకొన్ని ఉన్నప్పుడు సామాన్యంగా మనం చెప్పము. అహంకార స్వభావము గలవాడు మనస్సుని దాసీగా నీచవ్యక్తిగా చూస్తున్నాడు గనుక ఆ కోరికలన్నీ బయట పెట్టేస్తాడు. ఇదే దుశ్శాసనుడి చేత ద్రౌపదీ వస్త్రాపహారణం చేయించటం. ఇందులో కర్ణుని పాత్ర ఏమిటో చూద్దాం. అటువంటి చెప్పరాని కోరికను పదిమందిలో (సభామధ్యంలో) చెప్పవచ్చునా? ఇలా మనస్సు లోగుట్టు బయట పెట్టవచ్చునా? ఇది అశ్లీలం, అమర్యాద కాదా? ఇక్కడ పామర జనంతో కూడిన ఒక ఉదాహరణ తీసుకుందాం. విషయం స్పష్టంగా సులభంగా బోధపడుతుంది. ఈ పామర జనంలో ఒకడికి తన అన్న వదిన అంటే గౌరవంలేదు. వాళ్ళతో తగాదావచ్చి వాళ్ళనిగురించి తప్పుడుమాటలు నలుగురిలో మాట్లాడతున్నాడు. వాడికి తోడు వాడు చెప్పినవన్నీ చేసే తమ్ముడొకడు న్నాడు. మరి వీరిద్దరూ తప్పుడు మాటలు మాట్లాడుతుంటే, తప్పుడు పనులు చేస్తుంటే వాళ్ళ స్నేహితుడొకడుండి ఇలా చెయ్యడంలో మీ తప్పేమీ లేదు. అని సమర్థిస్తున్నాడనుకోండి వాడి వ్యక్తిత్వం ఎటువంటిది? ఇదిగో ఇప్పుడు కర్ణుడి వ్యక్తిత్వం అంత నీచమైందే. ద్రౌపదీ వస్త్రాపహారణం చేయాలన్న కోరిక ద్రౌపదికి సంబంధించింది కాదు. దుర్యోధనుడి మనస్సుకి సంబంధించింది. అంటే దురహంకారియైన జీవుడి మనః ప్రవృత్తి. ఈ ప్రవృత్తిని సభలో ప్రకటింపవచ్చునా? అంటే దేహభావం కలిగి క్షుద్రజీవితం గడుపుతూ దేహానుగుణంగా వర్తించే మనస్సుని దేహానికి దాసీగా నిర్ణయించే వ్యక్తి తప్పని ఎలా అంటాడు. పైగా నీమనస్సులోని కోరిక నువ్వు బైట పెట్టకోవటంలో తప్పేమీ లేదు. అని తీర్పు చెపుతాడు. అలాగే ఇందులో కోరిక మనదిగాని మనస్సు మనది గాదు. అల్లే ఎన్నో కోరికల్ని బైట పెట్టగలం. కాని అన్ని కోరికల్ని బైట పెట్టలేం. అది అవ్యక్త ప్రకృతిగా అలాగే ఉండిపోతుంది. ఇదే ద్రౌపదికి వస్త్రాపహారణం చేత మానభంగంజరుగలేదని ఎపుడూ ఒకవస్త్రం తొలగిస్తే మరొక వస్త్రంచేత కప్పబడియుండి మానం కాపాడబడిందని చెప్పబడింది. మానం మనస్సుకు సంబంధించింది. జీవులకు మనస్సునిచ్చిన పరమాత్మయే మానరక్షణంకూడా ఏర్పాటు చేశాడు. అందువల్లనే దుష్టులు ఎన్ని దుష్టవాంఛలతో చెడిపోయినా మళ్ళీ బాగుపడాలనే కోరికతో వాళ్ళజీవితం రక్షింపబడుతోంది. కాని ఈ చివరి దశ వచ్చేలోగా ఆదుష్టుణ్ణి వాడి మిడిమిడి జ్ఞానం ఎన్నో దుష్ట కార్యాలకు పురికొల్పుతుంది. అదే కర్ణుడు చేసిన పని.

ద్రౌపదీ వస్త్రాపహరణంలో అర్జునుడి భార్యపై కసితీర్చుకుంటే అభిమన్యువధా ఘట్టంలో కర్ణుడు అర్జునుడి కొడుకుపై కసి తీర్చుకున్నాడు. అభిమన్యుడు అసహాయశూరుడై చండప్రచండుడై యుద్ధం చేస్తుంటే ఈ కర్ణుడుకూడా తట్టుకోలేక పోయాడు. ఎవ్వరూ వాడి ఎదుట నిలువబడలేకపోయారు. అప్పుడు ద్రోణుడు 'ఈ అభిమన్యుడి చేతిలో విల్లు ఉండగా ఎవ్వరూ వాడినిఏమీ చేయలేరు. కనుక మీలో ఎవ్వరైనా వంచనగా ఆ విల్లువిరిచే ప్రయత్నం చెయ్యండి' అని సలహా చెప్పాడు.

అప్పుడా పనికి పూనుకొని వెనుకనుండి విల్లువిరిచి అభిమన్యుడి వధకు ప్రారంభించినవాడీ కర్ణుడే. ఇలా అధర్మయుద్ధం చేయడం వ్యక్తిగత ద్వేషం చూపడం వ్యక్తిత్వం ఉన్నవాడు చేసే పనేనా? దీన్ని పారమార్థిక దృష్టితో పరిశీలిద్దాం. అర్జునుడంటే నరుడు. నరుడంటే మనమే. ఈ అర్జునుడు మత్స్యయంత్రాన్ని పడగొట్టి ద్రౌపదిని వివాహము చేసుకొన్నవాడు. మత్స్యయంత్రము అంటే మన యొక్క మదము. లేదా గర్వం. ఈ గర్వాన్ని పడగొడితే మనకు మనస్సు స్వాధీనమవుతుంది. అప్పుడది జీవ ప్రకృతి లేదా స్వభావము అనే కుంతీదేవి అనుమతితో పంచేంద్రియాలకు వినియోగపడుతుంది. ఆతర్వాత పరమాత్మ అనుగ్రహంవల్ల మంచి భద్రమైన స్థితి కలుగుతుంది. ఇదే శ్రీకృష్ణుడు అర్జునుడికి సుభద్ర నిచ్చి వివాహం చేయడం. సుభద్ర అంటే మంచి శుభమైన స్థితి. మానవుడికి భగవదనుగ్రహంవల్లభద్రస్థితి సిద్ధించినపుడుకలిగే 'యోగదీక్ష'నే అభిమన్యుడు అంటారు. మన్యు అంటే పట్టుదల' అని అర్థం. దేహభావంకంటె వేరైన ఆత్మస్థితి పొందడానికి యోగదీక్షకు ఉద్యమించిన వ్యక్తియొక్క దేహాన్ని ఉత్తరించే స్వభావాన్నే ఉత్తర అంటారు. దేహంవల్ల కలుగ వలసిన ప్రయోజనం సంతానం కనడం అనేది నెరవేరిన తరువాత భోగజీవితం చాలించి యోగ జీవితం ప్రారంభించాలి. అప్పుడా జీవుడు సౌభద్రుడు అవుతాడు. అందువల్లనే అభిమన్యుడు పద్మవ్యూహ భేదనానికి వచ్చేటప్పుడు ఉత్తర గర్భవతి అని చెప్పబడింది. పద్మవ్యూహ భేదనం అనేది యోగసాధనకు సంబంధించిన విషయం. చాలమంది అభిమన్యు మరణం విషాదసంఘటనగా భావిస్తారు. కాని భారతకథని పరమార్థదృష్టితో పరిశీలిస్తే ఇది జీవుడు యోగసిద్ధిపొందిన సన్నివేశమనీ, దేహంలో బంధింపబడిన పరిమిత వ్యక్తిత్వాన్ని దాటిన పరమోత్కృష్టదశ అని తెలుస్తుంది. మన శరీరంలో పనిచేస్తున్న పంచేంద్రియశక్తులకు, మనస్సుకూ, వెన్నుపాము నాశ్రయించి ఆరు కేంద్రాలు ఉన్నాయి. ఇవి మన యందు నిత్యం మొగ్గవలె ఉంటూ వికాసాన్ని పొందుతూ ఉంటాయి కనుక ముఖ్యంగా సూర్యశక్తిని గ్రహించి జీవిస్తున్నమనలో ఇవి వికాసాన్ని పొందుతున్నాయి గనుక వీటిని 'పద్మాలు' అని సంకేతంగా చెప్పారు. ఈ ఆరుపద్మాల సమూహమే పద్మవ్యూహం. యోగసాధకు వాటి నొక్కొక్కటిని అతిక్రమించి ఆత్మస్థితిని చేరడమే పద్మవ్యూహ భేదనం. ఈ ఏర్పాటు అంతా శరీరంలో ఉంది గనుక శరీరమే ఈ ఏర్పాటు చేసింది. దాన్నే ద్రోణుడు అంటే ద్రోణము (దొన్నె) వలె వున్న మన శరీరమే. ద్రోణుడు పద్మవ్యూహం ఎందుకు పన్నెడంటే ధర్మజుని ప్రాణాలతో పట్టి దుర్యోధనుడికి అప్పగిండానికి. ద్రోణము అంటే శరీరము. ధర్మరాజు అంటే సృష్టిధర్మాన్ని అనుసరించి శరీరంలో నివసిస్తున్న జీవుడు. వీడికి పద్మవ్యూహం భేదించడం సాధ్యంగాదు. కాబట్టే ప్రాణం ఉన్నంతవరకూ శరీరంలో ఉంటున్నాడు. అప్పుడత డహంకారానికి గురి అవుతున్నాడు. అందువల్ల శరీరమే (ద్రోణుడు) జీవుణ్ణి- (ధర్మరాజుని) అహంకారానికి (దుర్యోధనుడికి) ప్రాణమున్న వరకు (ప్రాణాలతో) పట్టియిచ్చినట్టవుతుంది. ఇదెంతవరకూ సాధ్యం అంటే ఈసామాన్య సృష్టి ధర్మంకంటె వేరై పరమాత్మచేతసుభద్రస్థితి అనుగ్రహింపబడి ఆత్మస్వరూపుడుగా నున్న దేహాన్ని ఉత్తరించాలనే స్వభావం (ఉత్తర-భార్య) కలిగిన అభిమన్యుడు - యోగదీక్షాశాలి అపద్మవ్యూహంలో ప్రవేశించి నంతవరకే. అతడు వస్తూనే పద్మవ్యూహాన్ని భేదించి ఆత్మస్థితిని చేరుకుంటాడు. ఈవిధంగా దేహస్థితినుండి ఆత్మస్థితికి చేరుకుని ప్రయోగసాధకుణ్ణి అతని శరీరం ఏం చేస్తుంది. వాడు ఎంతకాలం జీవితం గడిపినా దేహభావంపొందడు. దీన్నే ద్రోణుడు తాను గూడా అతణ్ణి ఎదిరించలేనని చెప్పుతున్నాడు అప్పుడు ఆ పద్మవ్యూహాన్ని ఏర్పాటు చేసిన శరీరమే ఆత్మస్థితిలోనున్న జీవుడికి వినియోగపడుతున్న మనస్సునీ ఇంద్రియాలనీ ఐహిక సుఖాలవైపు మళ్ళించి, మోసంతో దెబ్బ తీయాలని అహంకారానికి సూచనచేస్తుంది. అప్పుడు అతని మిడిమిడి జ్ఞానం ఆపనికి పూనుకుంటుంది. ఒక తప్పు చేయవలసి వచ్చినపుడు- ఈపని చేయడంలో తప్పేమీ లేదు-అని మనకు అనిపింపజేసేదే మిడిమిడి జ్ఞానం. అదే భారతంలో కర్ణుడు. అందువల్ల అతడే అభిమన్యుడి విల్లు వెనకనుండి విరిచాడు. ఇక్కడ విల్లు అంటే మన మనస్సూ ఇంద్రియాలే- మనస్సు ఆధారంగా ఇంద్రియాలు సాధనాలుగా పని చేస్తున్నాయి. కనుక వాటిని ధనుర్బాణాలతో పోల్చి సంకేతంగా చెప్తారు. ఈసన్నివేశంలో భగవదనుగ్రహంలేని సాధకుడైతే ఐహిక సుఖాలకు లొంగి పతన మవుతాడు. అలాగాక అనుగ్రహం పొందినవాడైతే మనస్సునీ, ఇంద్రియాలనీ ఇతఃపూర్వమే భగవత్సమర్పణచేసి దేహం మీద మోజులేనివాడై ఉంటాడుగాబట్టి తిరిగి దేహస్థితికి పతనం జెందక (పద్మవ్యూహంనుండి తిరిగిరాక) ఆత్మస్థితినే పొందుతాడు. అభిమన్యుడలాంటివాడే గనుక పద్మవ్యూహాన్ని భేదించి పరమోత్కృష్టమైన పరమాత్మ స్థితిని పొందాడు. మరి అయితే కర్ణుడో మామూలే. వ్యక్తిగతద్వేషంతో అర్జునుడి మీద కసి అతని కుమారుడిమీద తీర్చుకున్నవాడయ్యాడు.

(సశేషం)

మార్గపద్ధతి - ఆధునిక రచయితలు

# శ్రీనాథుఁడు

— డా॥ అయ్యగారి నరసింహమూర్తి, ఎం. ఏ., పిహెచ్. డి.

( 20 వ సంచిక తరువాయి )

ఆగజపతులు రాజ్యము చేసిన తీరు ఈనాటి మనవారి పాలనకు ఉజ్జీగా ఉంది. నాటి పాలనను గురించి గ్రంథాలలో చూస్తున్నాం. నేటిపాలనను అనుభవిస్తున్నాం. అంతే తేడా 'చక్రార పంక్తి రివ' అన్నట్లు చక్రంలో ఆకుల్లా పాలనా పద్ధతులు, పాలకుల మనస్తత్వాలు పరివర్తిత మౌతూంటాయేమో! అలా అయిన పక్షంలో ఎవరూ ఎవరినీ భూషింప వలసిన పనిగాని, దూషింప వలసిన పనిగాని ఉండదు. కవి చెప్పిన దానిని కన్నులతో పరికించినపుడు ఎద కదలి స్రవించే అశ్రువులకు, కళ్లారా చూస్తూ అనుభవిస్తూంటే వచ్చే అశ్రుప్రవాహానికి భేదమేమీ ఉండదనుకుంటూ. తిలకించండి.

గజపతి ఆంధ్రభూమి తన
  కట్టడి పాలనక్రిందఁ బెట్టి త
త్ప్రజలను పన్నుసర్పములు
  బట్టఁగఁ బంపుచు జూదగాండ్రకై
బుజమును గాని దోపిడికి
  పూర్తిగ దోహదమిచ్చి నాయకుల్
విజయము పొందఁజూచి జరి
  పించె ప్రభుత్వము లక్ష్యహీనుఁడై. (125)

ఈరీతిగ ప్రజలను అరడి పెట్టడంలో నాటికి నేటికి అంతరమే లేదు.

సుకవికి నివసింప సుంతనీడయు లేదు
  దొంగ ఆర్జనకును దొడ్డమేడ
పండితునకుఁ గట్ట పాతపీలిక లేదు
  కల్లమ్ము వానికి తెల్లకలువ
చిత్రకారుఁడు పండ చిరుగు చాపయు లేదు
  కుంటెనగానికి క్రొత్తపరుపు
గాయకునకు త్రావ గంజికూడను లేదు
  నాయకునకు నెప్పు వల్లకూర
పాలకులుపాలకులుసొమ్ము పంచుకొనుచు
ప్రజల విన్నపముల కింత పరువు నిడక
దుష్టపాలన సాగించి యిష్టమటుల
ప్రాజ్ఞుల నుసురు పెట్టెను పశుప్రభుత. (126)

మంత్రు లధికారు లేకమై మదముతోడ
ప్రజలనోరు కొట్టి ధనిక రొట్టులయిరి
ఆంధ్రదేశ మిర్వుర సొమ్మయైనయట్లు
మోస మిది యన్న నువినరు మూగ
  ప్రజలు (127)

ఎపుడు కార్యాలయములకు నేగుచున్న
జేబులు తడుముచు నుండిరి జీతగాండ్రు
ప్రజల పనులు చేయుటకు నా ప్రభుతలోన
దొంగలే నయము గద యీ దొరలకన్న. (128)

నీచు లెల్లరు ధనమును దోచుకొనుచు
నింద చేయుచు నుండిరి నీతి తతిని
క్రొత్త చెప్పులు కిర్రెక్క కూతవెట్టి
కలికి కాళ్లను కసిదీర కఱచినట్లు. 129

ఇట నీయుపమానము ఉచితము, సందర్భోచితమునై సంభావనీయమగుచున్నది.

రక్షక నేతలు కితవుల
రక్షించుచు వారిడు పలలమ్ములు సురయున్
భక్షించి త్రాగి జతగా
లక్షలు గడియించుకొనిరి లాలూచి కథన్. (130)

ఈ వైరీతులన్నీ మనలో ప్రతియొక్కరికి ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రతిరంగంలో ద్యోతక మవుచున్నవే. అంతే కాదు.

వంచకు లందించెడు చెడు
లంచపు పెంటను తెగతినిలా వెక్కుమనే
రెంచని భవనములను గ
ట్టించిరి యధికారులు, ప్రజలేమను
  కొనిరన్. (131)

లోకపు తీరును చవిచూచి కవి పడిన వ్యథ ఈపద్యమున తారస్థాయి నందుకొన్నది.

ఈనాడును ఈ దేశంలో ఏభాగంలో చూచినా లంచపు పెంటను తిని లావెక్కుచున్న పెద్దమనుషులు ప్రళయ కాలానంతరము దుర్వాసనా పూరితమై ప్రవాహములలో తేలియాడుచు గోచరమగు కంకాళములవలె ఎక్కడ చూచిన అక్కడనే కనబడుచున్నారు. అవును మరి 'ఇతరులకే కావాలి నిజాయితీ తనకైతే మోసానికి జిరాయితీ' గదా!

ఒకనాడు యావత్ప్రపంచంలో నీదేశం కూడు గుడ్డలకు ఈడులేనిదని వాసిగాంచినది. కాలం మారిపోయింది. దానికి హేతు వెలా చెప్పారో చూడండి.

మాసికట్టిన చీర మరల నుతికి కట్ట
  మారుచీర లేదు మానవతికి
మేడమీద మంత్రి మెడవంచి చూడడు
  తెగులు సోకి యుండె తెలుగునాడు. (132)

సాక్షాద్విష్ణ్వంశ సంభూతుడైన వ్యాస మహర్షికి అన్నపూర్ణ కొలువైయున్న వారణాసిలో భిక్ష దొరకక ఏడు దినములాకటితో అలమటించినాడు. ఇక సామాన్యులగతి చెప్పేదేముంది? ఆవిషయాన్ని తలచుకొని శ్రీనాథు డిలా వాపోయాడు.

స్వర్గసమమైన కాశిలో వ్యాస సుకవి
  బక్కపేగునకే పెట్ట రొక్కముద్ద,
ఇంక నా లెక్క యీపురి నెవరి కుండు
  ప్రభుని బట్టియె యుందురు ప్రజలు
  కూడ. (178)

పదవులందినవారు అధికార దర్పంలో కన్నుమిన్ను గానక వ్యవహారం చేస్తూంటారు! రాజ్యాంతే నరకం ధ్రువమ్మనే సంగతే మరిచి పోతారు. ఈవిషయాన్నే శ్రీనాథుని నోటితో బొడ్డుపల్లెలోని మిత్రుని ప్రశ్నకుసమాధానంగా చెప్పించారు గ్రంథకర్త.

పాలకు లెందఱో భువిని
పాలన చేయుచు సొంతసొత్తుగా
నీలుగుచుందురు వారెఱుంగ
నేరక యొక్కొక వేళ నంతమా
కాలము మూడునేని యధి
కారము లెంతటివారికైన ఆ
వేళ నె జూడగావలెను
పెద్దల గొప్పలు చెట్టుపుట్టలన్

ఈపద్యం చదువగానే

విధిసంకల్ప బలంబుచే నొకడు తా
విశ్వంబు పాలించుచో
బధిరం బెక్కుడు చూపు తప్పుడు సదా
భాషల్ దురుక్తుల్ మనో
వ్యథతో మత్తతతోడ దుర్వ్యసనను
ర్వ్యాపారతన్ జెందున
య్యధికారాంతమునందు చూడవలదా
యాయయ్య సౌభాగ్యముల్

అన్న పద్యం స్మృతి పథంలోకి రాక మానదు.

ప్రకృతిలో ప్రతిప్రాణి స్వేచ్ఛగా కాలంగడుపుతూంటే బుద్ధి సంపదచే ప్రోడయైన ఈమానవుడు మరొక మనిషి కడ బానిసలా ఎందుకు బ్రతుకుచున్నాడని శ్రీనాథుడు తనదైన స్థితిని తలపోసుకుంటూ వాపోతాడు. యథార్థమే మఱి.

చిగురు వగరుగ్రోలి శీతలముగఁ బాడు
నుపవని కోయిల యుల్లసిల్లు
కర్దమ సారమ్ము కంజమ్ము సేవించి
కాసార మంతయు కలుపురంగు
గులకరాలనుదిని కువకువరవముతో
బ్రణయ సూక్తులు పల్కు పావురమ్ము
గాలిలోపలి నీరుఁ గానకుండఁగఁద్రాగి
లంజెసవర ముండు కంజమందు
దేవదేవుని సృష్టిలో దేనికడియె
బ్రదుకుచున్నది యితరుల భయములేక
మనుజుడేల రాజని పిల్చుమనుజు క్రింద
పుట్టుబానిసయై మను పొట్టకొఱకు
(168)

ప్రకృతిని చదివే తీర్పంటే అవ్యక్తికనేక విషయాలు అవగత మౌతాయి. ఈ పద్యం చూడండి.

నుతులుగొనియెడి వారికే వెతలు నిలుచు
పూలుపూచిన రెమ్మకేముండ్లు మొలచు
మనుజ జీవిత యాత్రలో మర్మమంత
ప్రకృతిలోవలె రచియించి ప్రభువు చూపె. (264)

పన్ను కట్టలేక పోయినందుకు ప్రభువు శ్రీనాథుని దండించు ఘట్టములోని దీ పద్యము.

కలుముల పడతి, చదువులసతి తెలుగు మాళిగలో కలసిమెలసి వాసము చేసే సీమకు ఏలికలు రెడ్డిరాజులు. ఆ రెడ్డిరాజుల ఆస్థానము నలంకరించిన శశాంకమనోజ్ఞ మూర్తి శ్రీనాథకవి సార్వభౌముఁడు. అతడు నిబిడమృదు మానస మోహనుడు. నిత్యము కవితాగోష్ఠులను నెఱపువాడు. సుకవులను మెప్పించిన పండితులకు నుడుగరలను మెండుగ పంచి యిచ్చు స్వభావము గలవాడు. చిన్ని నాపొట్టకు శ్రీరామరక్ష కావాలని ఆశించే తత్త్వం కా దాతనిది. చేతులార పరులకింత యిచ్చిన వాడే గాని తినకొఱకు నా ముందు నాటి కింత దాచుకోవాలనే అపేక్ష లేనివాడు అత డెంతటిత్యాగియో అంతటి భోగికూడ. ఈక్రింది పద్యాలు ఆవిషయాలను ఋజువు చేస్తున్నాయి.

అనుపమ రమ్యకావ్యముల
కాదరణమ్మును జూపునట్టి యాం
ధ్ర నృపులు పంపు నిమ్ముడులు
దాచు టెఱుంగని రీవితోడ జీ
వనమును సాంద్రసౌఖ్యమున పండుగఁ
జేసిన సత్కవీంద్రుడు. 151
'లేద'ని వచ్చు 'భవ్యులను'
లేద'న కుండగఁ జేరఁదీసియా
పేదతికమ్ము రూపమును
వీడ నొకప్పుడు దానపట్టముల్
ఆదటనిచ్చినట్టి ఘనుఁడు ... 238
తొమ్మిది కూరలున్ ఘృతము
తోఁ గలగిన్నెయుఁ దెల్లయన్నమున్
ఇమ్ముగ పెర్గు గల్గి భుజి
యించితి నెప్పుడు లోటులేక. 159

ఇక అతని వైదుష్యమూ అసామాన్యము.

ప్రాకృతాది సకలభాషా సముద్రాల
మథియించి చూచిన మందరాద్రి
అఖిలపురాణ ఘోరారణ్య మార్గాల
చిత్తమై తిరిగిన సింహరాట్టు
న్యాయ నియమశాస్త్ర నందనశాలల
పరమ భావముపల్కు పరభృతమ్ము
సర్వసారాగమ శైత్యభూభృత్తుల
రంజిల్ల మసలిన రాజహంస.
ఆంధ్ర పద్య కవితోదితాధ్యక్షుఁడు. 286

'నిరాశ్రయా న శోభంతే పండితా వనితా లతా' యని ఆర్యోక్తి. ఓఢ్ర ప్రభువుల కొలువులో శ్రీనాథునకు నిలువనీడ లేకపోయింది. నాటినుండే యితనికి పాట్లు ఆరంభమైనాయి. ఇంట్లో ఉన్న సొమ్ములన్నీ ఒక్కటొక్కటిగ పొట్టకోసం వెచ్చింప బడ్డాయి శ్రీనాథుడు నాటి ప్రాభవవైభవాలను, నేటి అభావస్థితిని తలచుకొని తలవంచుకొన్న తీరును చూస్తే ఎవరికైనా కష్టం కలుగక మానదు. ఈఘట్టం కరుణ కాలవాలం.

మణిమయమైన పాదుకలు
మామక పాదము లందునుండు నిం
పౌనరగఁ జేసి యిప్పుడవి
పోయెను నేబరువైతి నేమొ నా
తను విటు చిక్కికూడ నిల
దాపటచే సరికాలు లిట్లు బా
ధనుపడి బొబ్బలెక్కె నిది
దైవము యేరికి చూపి చెప్పెదన్. 163

ఆదురవస్థ ఎంతటి తీవ్రతరమైనదో గదా! కావున్న అపురూపమైన వస్తువులను కూడ వెచ్చింప వలసిన పని లేదు గదా! ఈపద్యం చూడండి.

పచ్చలు పొదిగిన బంగారు గంటమ్ము
బ్రదుకు తెరువునకై వదలి కదలె
రాజ సభల వేయు రత్నాంబరమ్ములు
కడుపు కక్కుటితిలోఁ గలసిపోయె
కాతకుంభమయిన శారదా శిల్పమ్ము
భటుల జీతాలకు బటువికరిగె
భోజన మొనరించు పుత్తడి పళ్ళెమ్ము
ఋణ బాధ కడ తేర గృహము వీడె
ఇంక తాకట్టిడి తినుట కేమి మిగిలె
మిగిలియుంటిని నేనిట్లు దిగులుతోడ
ఒక్క రోజును గడిచెడి దిక్కు లేద,
యట్టి జీవితమా నేటికిట్లు లయ్యె. 164

చేరెరసములన్ని శ్రీనాథు నందురు
నేటి విధముచూడ నిజమె యద్ది
ఒక్క కరుణమది నిక్కమై ననుబొంచె
ఏలకలిగె దాని కింత భక్తి 171

కూరవన్నము లోనికి గొలుప లేక
కారమునుగలు పుకొనుచుఁ గడుపుచుండఁ
కడుపులో మంటపుట్టెను కడకు నిపుడు
పైకి చెప్పఁగూడని యట్టి పాట్లువచ్చె.

చారునీళ్ళైన గతిలేక యూరకొంటి
పాడమెతుకు లింత నోటికి పోక రాత్రి
ప్రాణములు తీసుకొను చున్న వారి బాధ
తెలియుచున్నది నాకిప్డు తెల్లముగను.
161

ఒక్క ఓఢ్రప్రభువు వినా ప్రకృతి సమస్తము శ్రీనాథుని ఆడిడికి ఆరాట మందినది.

ఆపరిసరము లందలి యందమైన
ప్రకృతికాయువునిడినట్టి సుకృతివలన
ఆర్తి చెందె కవినిఁ జూపి యచటిసృష్టి
ప్రకృతికి కవికి నున్నట్టి బంధమే మొ.
184

(సశేషం)

# ఆనంద గజపతి - సమస్యా పూరణము

— సాహిత్యకోవిద శ్రీ క్రొవ్విడి రామం, బి.ఏ.,బి.యల్., బి.ఇడి.

( 20 వ సంచిక తరువాయి )

భాష్యకారవచనాల యొక్క వ్యాఖ్య పదవాక్యప్రమాణ పారావార పారంగతులైన వారికి తప్ప, నావంటి వారికి కేవలం అచుంబితం. మొత్తం మీద ఒక విధంగా, భాష్యకార నిర్వచనానికి సత్యవ్రతి అనే ప్రయోగం విరుద్ధంగా వున్నా, వేరొక భాష్యకార ప్రయోగాన్ని బట్టి, యీ పదప్రయోగం సమర్థనీయమే అవుతుం దని, కవితాత్పర్యమై యుండునని నాఊహ. ఈటిప్పణి గణపతి స్తవంతో ప్రారంభమైంది. ఈసమస్యాపూరణ పద్యాలలో చాలా వరకు సాహిత్య విషయికమైన వివరాలు, వేదాంత సూక్తులు వున్నాయి. ఆకాలంలో సంఘంలోకి కొత్తగా జొచ్చుకువస్తున్న పాశ్చాత్య నాగరికతా చిహ్నాల్ని కూడా కవిగారు తమ రచనలో జొప్పించేరు.

'రుతిపరుషమయి సరళముగ
నుతభావముగనినప్రాసను నిడి సమస్యాగతిని సరసు లని రెటు లన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్'

శబ్దస్వభావంచేత పరుషమయినప్పటికీ, ఋజుభావంతో కూడుకొన్న, శ్లాఘనీయమైన ప్రాసాక్షరాన్ని వుంచి, రసికులు సమస్యారూపంతో, సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ అని చెప్పేరని యీ పద్యంతాలూకు తాత్పర్యం. అయితే, శబ్దస్వభావంచేత పరుషమయినది శ్లాఘనీయమైన ఋజుభావం కలిగి వుండడం విరోధం 'కచటతప' లలో 'త' పరుషమే అయినా, ఆప్రాసాక్షరంతో, కవి, సరళభావాన్ని స్ఫురింప జేస్తున్నాడు గనక, విరోధపరిహారం. విరోధాభాస అలంకారం. వ్యాకరణంలో వుండే సరళ పరుషములయొక్క ప్రసక్తి యీ పద్యంలో వ్యక్తం అవుతున్నది. ఈపద్యమే, రుతిపరుషమయి సరళముగను, 'త' భావముగనిన అని పదవిభాగం చేసి చదివితే పద్యం మరీ రక్తి కడుతుం దంటారు కవిగారు-త అంటే తకారం-తకారం పరుషం-తభావముగనిన అంటే పరుషంలో కూడా సారళ్యాన్ని స్ఫురింప జేసే ప్రాస' అని అర్థం.

అయితే ద్రుతప్రకృతికం తరువాత 'త' కారంవుంది గనక 'ద' కారాదేశం వస్తే ప్రాసకే భంగంవస్తుందనే శంకకు కవిగారి టిప్పణిలో యీ విధంగా సమాధానం చెబుతున్నారు. భారతంలో ఉద్యోగపర్వ ప్రథమాశ్వాసం లో తిక్కన-

'ధృతరాష్ట్రుండును బుత్రులు న్వనమును తీనందనుల్ సింహముల్,
మతినూహింపన సింహమైనవనమున్ మర్దింతు రెందు న్వనా
వృతివృత్తంబులు గాని సింహములకు న్వేగంబ, చేటొందు గా
న, తగం బొందుట కార్యమీ యుభయమున్ సంతుష్టిమై నున్కికిన్'

అనే పద్యంలో నాలుగోచరణంలో ద్రుతరాహిత్యం చేసేడు గనక, యిక్కడ కూడా అదే పద్ధతిని అవలంబిస్తే, బంగారానికి వెలిగారం అద్దినట్టు వుంటుం దంటారు కవిగారు.

సతతము సత్యవ్రతుఁగని
మతిసరిగా, గరిమ పథని మగమా ధనిసా
గతి దివిజులు దివిపాడగ
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్'

అనే పద్యాన్ని మంగళ మధ్యానిఅనే సూక్తికి అనుగుణంగా కవిగారు గ్రంథానికి మధ్యలో ఇమిడ్చేరు–నృత్యగీత వీణా మృదంగాదులు స్వరూపంచేతను, నామ మాత్రంచేతను, మంగళప్రదములుగనక, సంగీతస్వర యుక్తమైన పద్యాన్ని యిక్కడ ఉటంకించేరు– 'సరిగా' మొదలైనవి సప్తస్వరాలలో కాక ప్రకృతానికి పనికి వచ్చే అర్థాన్నికూడా స్ఫురింపజేస్తా యని కవిగారు టిప్పణిలో వ్రాసేరు– ఇప్పుడు కవి వివక్షితమైన ప్రత్యేకార్థాన్ని టిప్పణి నుంచి తీసి యిక్కడ యథాతథంగా మనవిచేస్తాను–

'మతిని సరిగాన్–గరిమపథనిమగమా ధని సాగతి దివిజులు' అని పదవి భాగం, మనకునందు సరిగా బాడన్ అను క్రియతో సంబంధము– గౌరవమును కాపాడుకొనెడి ధనవంతులును, బంధనమును పొందిన లక్ష్మీదేవిచేతను ధనవంతులును – అగతితో కూడి కొనియున్న వారును అగు దివిజులు అని సమాసార్థము–మః పుంసిబంధనె పింగపింగళాభిధవర్ణయోః అని నానార్థరత్నమాల యందు, ఏకాక్షర కాండమునందు జెప్పబడియున్నది– బంధనము పొందిన లక్ష్మీకలవారు అనగా స్థిరసంపద కలవారని తాత్పర్యము–

కవిగారి టిప్పణితో కలిపి చదివినా కవివివక్షితమైన అర్థం, కేవల నారికేళ పాకవతుగానే వుంది– ఏది ఎలా వున్నా, దేవతలు సత్యవతిని చూసి, స్వరవిన్యాసంతో, తాళకాలాను గుణంగా పాడుతూవుంటే సత్యవ్రతికి ఆనందం కలుగుతుందనేది పిండితార్థం–

ఋతపూత, పూతజాత
వితతోతగీత శ్రుత స్రుతరతఘ్రాతాను
వ్రతజిత కృతకేతరతన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్

ఇది సనాళ, షోడశ పద్మబంధం–మూడు పాదాలు దళములయందు, సమస్య నాళంనందు కూర్చబడివుంది – 'ఋత = సత్యముచేతను, పూతపూత = పవిత్రమగు నటుల, జాత = పుట్టుచున్న, వితత = అధికముగా, ఊత = అనుస్యూతమైన, గీత = వాగ్వ్యాపారమును, శ్రుత = శ్రవణ వ్యాపారమును, స్రుత = గమనరూప పాదవ్యాపారమును – రత = రతియును (ఆసక్తియును) ఘ్రాత = ఘ్రాణేంద్రియ వ్యాపారమును, అనువ్రత = వ్రతము చేతను, జిత = స్వాధీనము చేసుకోబడిన, కృతకేతరతన్ = నిష్కాపట్యముచేతను సత్యవ్రతికి, సంతసము కలుగు నని అర్థము–'

సత్యంవల్ల పవిత్రంగా పుట్టిన కర్మేంద్రియ వ్యాపారముల యాథార్థ్యముచేత, సత్యవ్రతి సంతోషాన్ని పొందుతున్నాడని స్థూలంగా దీనికి అర్థం చెప్పుకోవచ్చును–ఈ క్లిష్టమైన భావాన్ని వెలువరించే కందపద్య పాదాల్ని, అంతకంటె క్లిష్టమైన, షోడశదళపద్మంలో బంధించగల పాండిత్యం కవిగారికి వుందని, యీ రచన స్పష్టంచేసింది–

కవి యెంత ఛాందసుడైనా, సమకాలీన పరిస్థితులను గుర్తించకుండా వుండలేడు. ఆకాలంలో నూతనంగా బయలుదేరినా స్పెషల్ ట్రెయిన్ (special train) టెలిగ్రాఫ్ వంటివికూడా ఏదో సందర్భం కల్పించి కవిగారు యీ శతకంలో జొప్పించేరు.

శ్రుతిజడవిధి విస్మృతి ను
త్తతగమన ప్రాక్తన స్వతంత్రీవార్తా
యితమహిత సత్యమహిమన్
సతతముసంతసమెసంగుసత్యవ్రతికిన్.

వేదాన్ని చదవడంచేత మందుడైన బ్రహ్మదేవుని విస్మృతిని పోగొట్టడం కోసం, తాను బయలుదేరడానికి ముందు పంపే తంతివార్తలాగ ఉచ్చరించే సత్యం, సత్యవ్రతికి సంతసాన్ని కలుగజేస్తుంది– ఒకడు తన రాకను ముందుగా టెలిగ్రాం ద్వారా తెలియజేసినట్లే, సత్యవ్రతి కూడా బ్రహ్మలోకానికి చేరే ముందు తన రాకను సత్య మహిమవల్ల ముందుగా జడుడైన బ్రహ్మకు తెలియజేస్తాడు. ఇది యీ పద్యం తాలూకు తాత్పర్యం. తంతివార్తాప్రస్తావన నాటి నాగరిక చిహ్నాన్ని ఈ పద్యంలో స్థూలంగా నిరూపిస్తుంది.

వేదాంత విషయాలంటే, యీకవిగారికి మక్కువ యెక్కువ కాబట్టి, శ్రుతిస్మృతులకు సంబంధించిన యెన్నో విషయాలను యీశతకంలో జొప్పించేరు– మచ్చుకు ఒక, కందంచూపిస్తాను–'సత్యేన వాయురా వాతి' అనే శ్రుత్యర్థాన్ని మనసులో పెట్టుకుని, వీరు–

'ప్రతిదినమునఁ బవనంబులు
స్మృతిదప్పక వీచుచుండు రేయిన్ బగలున్
ఋతమున నది యని తెలిసిన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్'

అనే పద్యాన్ని వ్రాసేరు–

హాస్యరస ద్యోతకములైన పద్యాలు కూడా అక్కడక్కడ కనపడతాయి.

'గతిమాలిన దని దయతో
గుతుకంబున నొక్క వెట్టిపక్కను బెనుపన్
గుతుకనది కొరుక నెటులను
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్'

అనే పద్యం కవిగారి హాస్యధోరణికి మచ్చుతునక.

'శత కత్ర పత్ర శతక
ప్రతిమాయిత సత్యశతక పరిశీలనచే
మతినానంద గజపతికి
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్'

అనిన్నీ,

'ఋతమానంద శ్రీ గజ
పతికి జయమునుమంగళంబు పరమార్థంబున్
సుతులు సితచ్ఛత్రాదులు
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్'

అనిన్నీ వ్రాసి, యీ శతకానికి వీరు మంగళాంతాన్ని చేకూర్చేరు.

అఖరి పద్యంలో కవిగారు –

'శ్రుత లక్ష్మీనారాయణ

కృతసత్యవ్రతి శతక సుకృతి కానంద
క్షితిపాలాగ్రణికిన్ మది'

అని చెప్పుకున్నారు. 'శ్రీమదానంద గజపతి మహారాజప్రేరణా ప్రేరితుండగు భాగవతుల లక్ష్మీనారాయణ కవిచే విరచితం బగు సటిప్పణ సత్యవ్రతి శతకము సర్వంబును సంపూర్ణము' అనేవాక్యంతో కృతిపూర్తి అయింది.

కవిత్వం లోకానికి దర్పణంలాగ వుండాలని అంటారు నేటిలాక్షణికులు. ప్రజల వ్యథలు, ఆనంద సుఖలు, నీరక్షీరన్యాయంగా కవితలో కనిపించాలని వారి మతం. కవిత్వం సామాన్య ప్రజల అందుబాటులో వుండాలని కూడా వీరు ఉద్ఘాటిస్తారు. అయితే, స్వయంగా కవి వ్రాసిన టిప్పణి సహాయంతో కూడా, అస్మదాదులు కొన్ని పద్యాల్ని అర్థం చేసుకోలేక పోతున్నప్పుడు, యీ కవిత ప్రయోజనం ఏమిటి? అనే ప్రశ్న సహజంగా ఉత్పన్న మౌతుంది. దీనికి ఒక్కటే సమాధానం. అప్పుడప్పుడు మనం సర్కస్సు చూస్తాం. పులిని అగ్ని గోళం లోనుంచి సర్కస్సులో దూకిస్తాడు. దాని వల్ల ఏం ప్రయోజనం? అంటే మానవుని శక్తి సామర్థ్యాలు తద్వారా వ్యక్తమౌతాయి అనిన్ని ప్రేక్షకులకు ఆదృశ్యం ఆశ్చర్యాన్ని ఆనందాన్ని, కలిగిస్తుందనిన్నీ సమాధానం చెప్పాలి.

సాహిత్యంలో ప్రదర్శితమయ్యే బంధకవిత్వం, అష్టావధానం మొదలైనవి కూడ అటువంటి ప్రక్రియలే. రచయితయొక్క ప్రతిభా వ్యుత్పత్తులను తెలియజేయడానికీ, సాహిత్యాభిలాషులైన మేధావివర్గానికి ఆనందాన్ని చేకూర్చడానికి యీ feats ఉపకరిస్తాయి. ఈ సత్యవ్రతి శతకం, ఆకోవకు చేరింది. దీని ప్రయోజనం కొంత మందికి మాత్రమే పరిమితం. అయితే సుమారువందసంవత్సరాల కిందట సూరి సభారమ్యంగా, రాజసభాయోగ్యంగాను ఇటువంటి కవితల్ని వినిపించడం తెలుగుదేశంలో ఆచారంగా వుండేది.

---

ఋతుషట్కము — 3.

# వర్షాభ్యుదయము

— శ్రీమతి జి. కమలారాఘవన్.

---

తొలకరి వానలు మొదలిడె
జలజల వడగండ్లు రాలె సాగెను నిలపై
మిలమిల మెఱసెను మెఱపులు
ఫెళఫెళమని పిడుగులు లుగ్గె భీతి
  జనింపన్.

వానదేవు పరిష్వంగ మూని పుడమి
అలనిదాఘకార్శ్య మెడలి చెలువు మెరసి
పారవశ్యము జెందగ పసిడిమేని
పులకలో యన పచ్చిక మొలకలెత్తె.

మేఘమాలికలోలి మింటిపై చెలరేగి
  యురుముల నురుముచు పరువులెత్తె
మెఱపుతీగలుకండ్లుమిరుమిట్లు గొలుపంగ
  మెఱయు చందము భీతి వఱలఁజేయ
విరిసినహరివిల్లు వింతరంగులనీని
  గగనలక్ష్మి మెడకు కంటెగాగ
జలధారలిల జారిచెలువుమై ముత్యాల
  చేరులై కనువిందుసేయు చుండ
నదనదీప్రతతులు పొంగి నాల్గుదెసల
పైరుపచ్చల జగమెల్ల పస లెసంగ
చాతకావళి కుత్సాహ జనక మగుచు
వర్ష ఋతుశోభ యీలీల వరలెఁ బ్రీతి.

మండూకధ్వనులుల్లసిల్లె దిశలున్
  మార్మ్రోగ మత్స్యావళీ
తండంబుల్ చెరలాడుచున్ విలసితో
  ద్యత్క్రీడ గావింపగా
పిండుల్ గట్టి తటాక తీరముల దీ
  పించెన్ ఖగస్తోమముల్
పండెన్ కోర్కులు కర్షకావళికి నీ
  ప్రావృట్పయోధారలన్.

విరిసిన పారిజాతములు
  విచ్చిన కల్వలు తమ్మి దొంతరల్
వరలిన కేతకీచయము
  భాసిలు చంపక సౌరభంబులున్
అరుదుగ పండు నేరెడులు
  నాదరపూర్వక మెంతొ మెచ్చియున్
సరసపు వన్య భూజములు
  శ్రావణలక్ష్మికి కానుక లిచ్చెడిన్.

కిరణజాలంబుల గిలిగింత లిడివేడ్క
  కిలకిల నవ్వించు కెరలి కెరలి
పచ్చని నీరెండ వెచ్చ వెచ్చగదాకి
  పొలయలుకలు దీర పుడికి పుడికి
అరుణ కాంతుల జొన్పి యరవిడు మొగ్గల
  ప్రియమార రెక్కలు విప్పి విప్పి
సరసిలో నీడయై సరసంబు లాడుచు
  పరువంబు నెల్లను బావి బావి
రేయిఁబడి నట్టి విరహంబు వాయజేసి
అబ్జబాంధవుడను పేరు సార్థకముగ
పలుతెరంగుల లాలించె పద్మలతల
అమిత శృంగారమూర్తియై యంశుమాలి.

కప్పలు కప్పలై తెప్పరంబుగ పారి
  జాతము నొకప్రక్క సౌరుజూప
తెప్పలు తెప్పలై దొప్పల చిప్పలు
  మందార మొకప్రక్క మధువులొలుక
తిప్పలు తిప్పలై గొప్పగా విరబూయు
  పున్నాగ మొకప్రక్క పొలుపుమీర
ఉప్పర కప్పలై చప్పరంబుల గ్రాలు
  విరజాజి యొకప్రక్క విరగబూయ
చిక్కనౌ పొదరిండ్లపై చుక్కలట్లు
చొక్కమౌ చిరుమల్లెలు నిక్కిచూడ
మక్కువలరించు చామంతి చక్కదనము
అక్కజంబగు కనుగొన్న నాస మెరయ.

ఘనమగు కృష్ణాష్టమియున్
గణపతి నవరాత్రు లింపుగా గను రంజాన్
ఒనరిన పండుగ లిలపై
కను విందౌ యీ ఋతువున కాంక్షలు
  మీరన్.

(తరువాయి 14వ పేజీలో)

# నవలా సాహిత్యము - శ్రీమతి రంగనాయకమ్మ (1947 - 77)

— కుమారి తుర్లపాటి రాజేశ్వరి, ఎం. ఎ.

( 20 వ సంచిక తరువాయి )

ఇక కృష్ణవేణి (1958) లో భార్యాభర్తల సంబంధము ఎట్టి పరిస్థితులలోనూ అపవిత్రము కారాదని చెప్పిరి.

'భార్యాభర్తలలో ఏ ఒక్కరు అపవిత్రత పాలైనా మరొకరికి తీరని వేదన, ఆసంసారలో ఆరని చిచ్చు, వారి సంతతిలో అవకతవకలు [పుట-62 కృష్ణవేణి] 1958లో 'కృష్ణవేణిలో'లో వెలిబుచ్చిన మాటలు 1971 లో 'అంధకారంలో' అనిన మాటలతో పోల్చి చూచిన ఆమె అభిప్రాయములందు వచ్చిన మార్పు సుస్పష్టమగుచున్నది.

ఇంతకంటె నింకను ముందుకు వెళుతూ 'ప్రేమ ప్రేమను ప్రేమిస్తుంది' నవలలో (1972-73)సుధ రాజారావుకి ఒక అమ్మాయి ఇద్దరుఅబ్బాయిలను ప్రేమించిన కథ చెప్తూ చూ' ముగ్గురూ కాలక్రమేణా కలసి జీవించటానికి ఇష్టపడతారు. కానిఅది చట్టసమ్మతమూ కాదు. సంఘసమ్మతమూ కాదు. ఒకరికి హాని జరగని విషయాల్లో ఎవరి సమ్మతము వారికే కానీ ఇతర సమ్మతాల లక్ష్యం వుండకూడదు' (పుట 47)-అనిరి.

చట్ట సమ్మతమూ, సంఘసమ్మతమూ కాకపోయిననూ ఒక అమ్మాయి ఇద్దరబ్బాయిలతో ఉండవచ్చునని పై నవలికలో చెప్పిరి. కృష్ణవేణి (1958) నవలలో కృష్ణవేణి చట్టసమ్మతమూ, సంఘసమ్మతమూ కాదనియే మాధవ్‌ని వివాహమాడుటకు నిరాకరించినది. కావున కాలక్రమమున రచయిత్రిలో వచ్చిన మానసిక పరిణామము విశదము.

జానకి విముక్తి నవలలో (1977) స్త్రీ పురుష సంబంధములను గూర్చి చర్చించుచూ

'మనం దోపిడీ సమాజంలో వున్నాం. మన సమాజంలో ఫ్యూడల్ సంస్కృతి బలంగా ఉంది. ఇలాంటి స్థితిలో స్త్రీ పురుషుల మధ్య సంబంధాలు పరమ నికృష్టంగా వుంటాయి. పురుషుడు అధికారిగానూ, స్త్రీ బానిసగానూ వుంటారు. ఎక్కడో నూటికి ఒకరిద్దరు స్త్రీలకు తప్ప స్త్రీలకు బూర్జువాహక్కులూ, బూర్జువాస్వేచ్ఛ అయినా లేవు. అన్ని విధాలా పురుషుడి మీద ఆధారపడి బతుకుతున్నారు'

రాజకీయ పరముగా దేశములో మార్పు వస్తే తప్ప స్త్రీల ప్రస్తుత పరిస్థితి మారదని అభిప్రాయ పడుతూ స్త్రీ పురుష సంబంధము లెట్లుండరలెనో ఈ క్రింది విధముగా చెప్పిరి.

'స్త్రీ పురుషుల సంబంధము ఎప్పుడూ స్నేహంతో నిండిపోవాలి. భూమి కి వెన్నెల కురిసినంత సహజంగా ఒకరి ప్రేమ ఒకరికి కురవాలి. గడిపితే అంత సుందర జీవితం గడపాలి. లేకపోతే ఆసంబంధం మానెయ్యాలి. జీవితాన్ని ఎప్పుడూ కష్టంగా దుఃఖంగా చేసుకోకూడదు (పుట83)

సంవత్సరాల తరబడి భిన్నాభిప్రాయాలతో కష్టాలతో జీవితాన్ని గడుపుతున్న స్త్రీజాతిపట్ల సానుభూతి చూపుతూ అట్టి స్త్రీలు విడిపోయి స్వేచ్ఛగా జీవించవలెనని ప్రబోధము.

2. వ్యక్తిత్వముల సంఘర్షణ :

స్త్రీపురుషుల వ్యక్తిత్వముల మధ్య సంఘర్షణ పేకమేడలు నవలలో ప్రారంభమయినది. ఈసంఘర్షణకు కారణము లన్వేషించుచు రచయిత్రి

'అభివృద్ధి కాంక్షిస్తున్న స్త్రీ వేగంగా మారుతున్నది. అధికారం వదులుకోవలసిన పురుషుడు మారలేక పోతున్నాడు. అందుకే ఈ మానసిక సంక్షోభం. (పేకమేడలు పుట 134)

పేకమేడలు (1962) నవలలో భాను చదువు సంస్కారము, వ్యక్తిత్వము కలిగిన యువతి. భాను భర్త రాజశేఖరమునకు స్త్రీ అనగా కేవలము వంటింటికి పడకటింటికి పనికివచ్చెడివస్తువు. పేకాటరాయుడు మూర్ఖుడునైన భర్తతో భాను జీవితము నరకసదృశమైనది. భర్తను మార్చుకోవలెనని భాను చేసిన ప్రయత్నములు బూడిదలో పోసిన పన్నీరైనవి. భర్తదౌర్జన్యమునకు అమానుషత్వమునకు సహించలేని భాను ఆత్మహత్య చేసికొనినది.

---

( 13 వ పేజీ తరువాయి )

శ్రావణ శుక్రవారములు
రంగుగ మంగళగౌరి నోములున్
భావము రంజిలంగతమ
భద్రముకోరి సుమంగళుల్ తగన్
పావన సత్క్రియాసరణి
భాసుర రీతిని సల్పిరెంతయున్
శ్రీ వనజాక్షి గౌరియును
చిత్తముపొంగి వరంబులీయగన్.

వాగులు వంకలు ప్రబలమై ఉప్పొంగి
యురవళ్లపరవళ్ళ నురుకలెత్తి
కోటలు పేటలు గూల్చుచు జడివాన
భూతలిన్ వడగండ్లముంచి యెత్తి
తోటలు బాటలు పాటుమై పరవని
పరుపులై పచ్చని పచ్చి కమర
గుడులను బడులను కుట్టలు పడవలా
టలను కేరింతల నలరుచుండ

నీలిమబ్బుల నీడల నెమళులాడ
తరులతాదులు ననలెత్తి కరము మెరయ
వరలె నేత్రోత్సవముమీర వసుధయెల్ల
వర్షఋతురాజు శ్రీనిమై వచ్చువేళ.



ఈ నవలలో భానుకి భర్తని విడిచి స్వతంత్రముగా జీవించవలె ననెడి ఆలోచన రాలేదు. తాను కోరుకొనిన జీవితము లభ్యము కానందున విసిగి భాను ఆత్మ ఆత్మహత్య చేసికొనినది. ఈ నవలలో సృష్టించిన రాజశేఖరము స్వీట్ హోమ్ లో (1968) శ్యామలరావు (విశాలభర్త) 'జానకి విముక్త'లో (1977) వెంకట్రావులను పోలినవాడు.

భానుకి, విశాలకి, జానకికి ఆలోచనలలో చైతన్యములలో భేద మున్నది.

'స్వీట్ హోమ్' లో విశాల అక్క విమల మాటలచేత ఉద్బోధితయై భర్త తనతో అమానుషముగా ప్రవర్తించిన అతడిని విడిచి పెట్టి స్వతంత్ర జీవనము సాగించగల ననెడి ధైర్యము ప్రకటించును. 'జానకి విముక్తి' లో జానకికి భర్తను విడిచి పెట్టుట యనెడి యాలోచనయే తప్పుగా తోచును. సమాజములో సాధారణముగా స్త్రీలలో నుండెడి పిరికితనము, నిస్సహాయత, ఎదుటివారు తిన కష్టములను విని సానుభూతిని చూపవలె ననెడి మన స్తత్వము గల స్త్రీ జానకి. వెంకట్రావు ప్రవర్తన జానకికి కేవలము బాధను కలిగించినదే తప్ప అసహ్యమును కలిగించలేదు. అన్ననుండి ఆమె సానుభూతి కోరెనే తప్ప అతడు తనను భర్త నుండి వేరుచేసి స్వతంత్ర జీవనము నేర్పఱచుట హర్షించలేక పోయినది.

జానకి కంటె వ్యక్తిత్వము, చైతన్యముగల స్త్రీ భాను. పరితిలలో భర్తల అమానుషత్వమునకు బలి యగుచున్న స్త్రీలను దృష్టిలో నిడుకొనియు అప్పటికి రచయిత్రి మానసిక స్థాయి ననుసరించియు భాను కథలో ముగింపు అట్లు జరిగెనని చెప్పవచ్చును 'జానకి విముక్తి' లో శ్రీమతి రంగనాయకమ్మ స్త్రీజాతిలో చైతన్యము రావలె నని ఆశించిరి. భర్తతో జీవించుట దుర్భరమైనపుడు స్త్రీ విడిపోవలెనని, భర్త దౌర్జన్యాన్ని అహంకారాన్ని ఆమోదించు కొనుచూ బ్రతుకుట అసహ్యకరమైన విషయమని అభిప్రాయపడిరి.

"పురుషాధికారం లేని సమాజమే స్త్రీలను సంపూర్ణంగా విముక్తి చేయగలదు గాని ఒకొక్క స్త్రీకి ఒక్కొక్క అన్నవుండీ ఒకొక్క వెంకట్రావుని దండించీ, సంస్కరించీ కాదు (పుట 123 - జానకి విముక్తి), పురుషాధికారములేని నవసమాజము - సర్వమానవులూ సమాన మనెడి నవసమాజము స్త్రీలకు సుఖజీవితమును తప్పక ప్రసాదించు నని - అట్టి నవసమాజ నిర్మాణమును కోరిన అభ్యుదయవాదిని శ్రీమతి రంగనాయకమ్మ. 'కూలిన గోడలు' నవలలో (1964) సుధారాణి తన భర్త తిరుగుబోతు, జల్సారాయుడు, దుర్మార్గుడు కాగా, పుట్టినింటికి వచ్చును. మధు ఆమెతో "మన సమాజ ధర్మాలన్నీ నీకు తెలుసు. కాపురంలో కష్టమైనా సుఖమైనా సహించవద్దాళ్ళి ఇప్పుడు నాకోసం బాధపడి నన్ను పెళ్ళి చేసుకో గలవా? జీవితంమీద విరక్తి పెంచికొని చచ్చిపోగలవా? నీ భర్త మీద అయిష్టంతో ఒంటరిగా బ్రతకగలవా! ఏదీ సాధ్యంకాదు ." (పుట 356) అంటాడు.

ఇచట కాపురములో కష్టసుఖములు ఓర్పుతో సహించవలెనని, సమాజ ధర్మములకు కట్టుబడి ఉండవలెనని, భర్తను వదలి ఒంటరిగా బ్రతుకుట అసాధ్యమని రచయిత్రి చెప్పిరి. "రాజశేఖరాన్ని మనిషిగా మార్చటానికి నీ వ్యక్తిత్వం తాత్కాలికంగా సడలించుకోవాలి సుధా .." (పుట - 357) అంటూ కాయశక్తుల నతడిని మార్చుటకు యత్నించవలెనని చెప్పిన రచయిత్రి 1968 స్వీట్ హోమ్ రచనా కాలమునకు స్త్రీ తన వ్యక్తిత్వము నేమాత్రమూ సడలించ నక్కరలేదని అభిప్రాయ పడిరి. 1977 జానకి విముక్తిలో ఇదే అభిప్రాయము మరింత శక్తిమంతముగా చెప్పుట జరిగినది.

సమాజ ధర్మములకు కట్టుబడి, మనిషి మనుగడ సాగించాలనెడి (1958) కృష్ణవేణి (1964) కూలిన గోడలు అభిప్రాయము (1972-73) ప్రేమ ప్రేమను ప్రేమిస్తుంది నాటికి, ' వొకరికి హానిజరగని విషయాల్లో ఎవరి సమ్మతం వారికే గానీ ఇతర సమ్మతాల లక్ష్యం వుండ గూడదు." (పుట - 47) - అని నిశ్చయంగా వెలిబుచ్చిరి. ఈ అభిప్రాయము లందలి మార్పులు విస్పష్టములు.

'రచయిత్రి' (రచనాకాలము 1965) ఇందలి నాయిక విజయ రచయిత్రి. స్థిరమైన వ్యక్తిత్వముగల స్త్రీ. ఆమె భర్త మోహన్ తన భార్య తనకంటె అధికురాలుగా నుండుట సహించలేక పోవును. విజయా-మోహనుల నడుమ అభిప్రాయ భేదములు తలయెత్తినవి. వారి వ్యక్తిత్వములను సంఘర్షణను నేర్పుగా చిత్రించిన నవల.

"కళ ఎందుకు" నవలలో (1967) మోహినీసుధాకరుల వ్యక్తిత్వము, సంఘర్షణ కలవు. మోహినికి కళారాధన ప్రాణము. అట్టి మోహినికి సన్నిహితుడై కోరి వివాహమాడినవాడు సుధాకర్. వివాహానంతరము మోహిని నృత్య ప్రదర్శన లిచ్చెదనన్నపుడు సుధాకర్ ఆశ్చర్యపోయి ఆమెతో వాదించినాడు.

"నువ్వు నాట్యం చెయ్యాలి పాటలు పాడాలి కానీ నాకోసమే. నీ గానం. నాకోసం, నీనాట్యం నాకోసం,నీఅందం నా కోసం. నీ నుంచి పొందే ఏ ఆనందం లోనూ ఎవరికీ చోటులేదు. నాకు అపురూపముగా దక్కిన నిన్ను ఎవ్వరికీ పంచలేను ( పుట. 294 ) మోహిని ఈమాటలకు వ్యథిత హృదయయై అతడిని విడిచి కళానిలయమునకు వెళ్ళిపోవును.

"అంధకారంలో" (1972) ప్రేమించి పెళ్ళిచేసుకొనిన దంపతులు

లలితా, శేఖర్‌ల మధ్య అభిప్రాయ భేదములేర్పడినవి. సంస్కారి వలె కన్పించెడి శేఖర్ భార్య లలిత తన పూర్వ జీవితములో జరిగిన ఒక సంఘటన చెప్పగా అనుమానించి "నీబావతో నీకు సంబంధము వుండే వుంటుం" దని ఆమెను దూరము చేసుకొనినాడు. లలిత "రచయిత్రి" నవలలో విజయవలె బలమైన వ్యక్తిత్వము కలస్త్రీ. హృదయ వైశాల్యము లేని అతడి సంకుచితత్వానికి దిగ్భ్రాంతయైన లలిత కాకినాడ కేగి మరల నూత్న జీవితమును నిర్మించుకొనినది.

ఇదే నవలలో రామ్మూర్తి వాంఛతో కొట్టుకు పోయెడి వ్యక్తి. భార్య సుందరమ్మ అతడి కండ్లకు ఒక వస్తువ వలె కన్పించినది. పిల్లలను కనటమే తప్పించి భర్తగా, తండ్రిగా అతడు తన బాధ్యతలను నిర్వర్తింపలేదు. తామరాకు మీద నీటిబొట్టు వలె రామ్మూర్తి ఆఫీసు వేళకు ఇంటిలో భోజనము చేయుచూ, పరాయిస్త్రీలు దొరకని రోజున భార్యను పక్కమీదకు లాగుచూ సంసారమును చేయుచున్న పుణ్య పురుషుడు. ఇక సుందరమ్మలో భర్త తనను నిండు మనసుతో లాలించవలె ననెడి కోరిక తీరలేదు. యాంత్రిక జీవితముతో విసిగి పోయిన సుందరమ్మకి భర్తమీద అసహ్యమూ ద్వేషమూ పెంపొందినవి. ఇట్టి స్థితిలో రమణమూర్తి తన అందమును పొగుడుతూ వ్రాసిన ఉత్తరం చదువుకొన్న ఆమెలో నిద్రాణముగా నున్న కోర్కెలు మేల్కొన సాగినవి. అసంతృప్తి మూలమున ఆమెకు మూర్ఛలు ప్రారంభమై కడకు పిచ్చిదిగా మారినది. ఏ ఆధారమూ లేని భార్యలు భర్తల అమానుషత్వమునకు, మూర్ఖత్వమునకు నెట్లు బలి అగుదురో సుందరమ్మ పాత్రలో రచయిత్రి చూపించిరి.

2. సమాజచిత్రణ :-

మన సమాజములో కోడలితో అత్తా ఆడబిడ్డలు వ్యవహరించెడి తీరు, వారి సంబంధ బాంధవ్యములు ఈక్రింది నవలలో చూపబడినవి.

(i) సమాజములో స్త్రీలు తమ భర్తల కఠినత్వమునకు నీచత్వమునకు అలవాటు పడి, తమ అత్తల దౌర్జన్యమును అనుభవించి అత్త హోదాలో వ్యక్తి ఇట్లుండవలెనని తలంచి, కోడలు వచ్చిన వెంటనే ఆమెను బాధించుట కుపక్రమింతురు. 'చదువుకున్న కమల'లో అత్త శేషమ్మ కోడలిని సాధించుచు అత్తగారి హోదాను చూపించుకొనవలెనని తాపత్రయ పడగా, ఆడబిడ్డ కాంతం వదినగారిని ఆదరముతో నేనాడును చూడలేదు.

'కళ ఎందుకు?' నవలలో చంద్రశేఖరము తల్లి కోడలు కళాబాల వీణవాయించిన మాత్రముననే తమ ఇంటి పరువు ప్రతిష్ఠలు మంట కలుస్తవని కఠినోక్తులాడిన అత్త.

'ఇదేనా న్యాయం?' శేషయ్య తల్లి కోడలు సీతను పరమ నికృష్టముగా చూచి అనేక కష్టముల పాల్చేసినది.

'అంధకారం'లో శకుంతల అత్తా ఆడబిడ్డల కష్టములను భరించలేక ఆత్మహత్య చేసికొనినది.

'జానకి విముక్తి' లో వెంకట్రావుతల్లి జానకిని. సాధించుటయే ధ్యేయముగా పెట్టుకొనిన అత్త.

వరకట్న సమస్య :

ii) వరకట్న సమస్యను గురించి దాని పరిణామములను గురించి రచయిత్రి 'కృష్ణవేణి'లో తారకథ, 'కళ ఎందుకు ?' లో మాలతి కథద్వారా 'స్త్రీ' లో పార్వతి కథనము ద్వారా చర్చించిరి.

'విద్యావతులైన స్త్రీలు కట్నమిచ్చి వివాహము చేసికొనరా' దని 'స్వీట్ హోమ్' లో విమలతో ఇందిరకు చెప్పించిరి.

'విద్యావతివై చదువుకుని సంపాదించుకుంటూ నిన్ను పెళ్ళి చేసుకోవటానికి డబ్బు అడిగేవాడి ముందు కూర్చోటం తప్పుకాదూ? చదువు సంధ్యలులేని ఆడపిల్ల స్థితిలో నే నువ్వూ ఉంటే నీచదువెందుకు కాల్చనా? నువ్వు మనిషిగా నిలబడకపోతే ఇక నువ్వు సాధించినదేమిటి? అసలీ చదువెందుకు చదివావు? ఇన్ని వేలు తగలేసి?

స్త్రీలకు ఆత్మాభిమానము, సమస్యలను పరిష్కరించుకొనెడి శక్తి ఉండవలెనని శ్రీమతి రంగనాయకమ్మ గారి అభిప్రాయము.

స్త్రీవిద్య

iii) స్త్రీలందరూ విద్య నభ్యసించవలె నని రచయిత్రి అభిప్రాయము 'స్త్రీ' నవలలో పద్మజచేత చెప్పించిరి.

'స్త్రీ అంటూ సృష్టించి జాతిని విడదీయటమే మూర్ఖత్వ మంది. పురుషునికి స్త్రీకి మానసికంగా భేదమేమీ లేదంగి. స్త్రీ సుఖమూ, స్త్రీ దుఃఖమూ, స్త్రీ సమస్య, స్త్రీజీవితం. స్త్రీ సర్వస్వమూ పురుషునితో ఏకీభవించి ఉంటుందంది. (పుట-69-స్త్రీ)

ఇదే అభిప్రాయము 'స్వీట్ హోమ్' లో విమల చేత, రచయిత్రి' లో విజయ చేత చెప్పించిరి.

(సశేషం)

# హిందీకవి జయశంకర ప్రసాద్

— శ్రీ హెచ్. యం. యస్. కామేశ్వరరావు, ఎం ఏ.

ఆధునిక హిందీ సాహిత్యంలో ఎన్నో సాహిత్య ప్రక్రియలు వెలువడ్డాయి. యుగ ప్రభావం, తత్కాలీన సమాజం, కవి యొక్క అనుభవాలు, అనుభూతులు ఇవన్నీ సాహిత్యంలో ప్రతిబింబిస్తాయి. కవి యొక్క ఆలోచనా శక్తి, దృష్టి, కేవలం అతని వరకే పరిమితమై వుండవు. తన కల్పనా వైభవంతో కవి రచనా వ్యాసంగము సాగిస్తాడు. అతని భావాలు విశ్వజనీనములు కాక తప్పదు. ఆధునిక హిందీ సాహిత్యంలో స్వర్గీయ జయశంకర్ ప్రసాద్ మహోన్నత కవిగా వెలుగొందేడని చెప్పడంలో ఎటువంటి అతిశయోక్తి వుండనేరదు. హిందీలో ఛాయావాద మని ఏర్పడిన ఒక ప్రక్రియను ఇతను ప్రాణంపోసిన వాడు. గొప్ప శబ్దశిల్పి, అర్ధ, శబ్ద గాంభీర్యాలలో కవితను మహోత్కృష్టంగా మలిచిన గొప్ప మహానుభావుడు.

జయశంకర ప్రసాద్ కేవలం మహాకవియే కాదు. నాటకాలు, నవలలు, కథలు, వ్యాసాలు ఎన్నెన్నో వ్రాసి హిందీ సాహిత్యంలోని ఆధునిక హిందీ యుగంలో గొప్పఖ్యాతిని ఆర్జించిన ప్రతిభావంతుడు. ఇతని పాండిత్యం విలక్షణమైనది. ఇతని ప్రతిభ బహుముఖమైనది. కాశీలో 1889 లో ఇతను జన్మించినాడు. ఇతని కుటుంబికులు వశ్యము వ్యాపారము చేసేవారు. అందువల్లనే ఇతని వంశము వారిని 'సుంఘనీసాహు' అని పిలవడం కూడా కద్దు. ఈ సందర్భంలో ప్రఖ్యాత హిందీ కవయిత్రి శ్రీమతి మహాదేవి వర్మ వ్రాసిన 'గర్వీలా దేవదారు' వ్యాసంలోని ప్రముఖ ఘట్టం గుర్తుకి వస్తుంది. ఒకసారి ఈమె ప్రసాదుని దర్శించాలని కాశీ వెడుతుంది. స్టేషన్‌లో దిగిన తర్వాత 'జయశంకర ప్రసాద్ ఇల్లు ఎక్కడ?' అని అడిగితే ఎవరూ చెప్పలేక పోతారు. అంత పెద్ద కవికదా, ఆయన ఇల్లు వీళ్ళకి తెలియక పోవడం ఆమెకి ఆశ్చర్యం కలిగిస్తుంది. ఒక గుఱ్ఱపుబండివాడు 'సుంఘనీసాహు ఇంటికి తీసుకువెడతాను ఆయనకూడా కవిత్వము వ్రాస్తారు. ఆయన ద్వారా మీకు వివరాలు తెలుస్తాయి." అని పట్టుపడతాడు సరేనని ఆమె వెళ్ళినతర్వాత తీరా ఆ సుంఘనీసాహు ప్రసాద్ ఒకరే అవుతారు. కవయిత్రికి ఆశ్చర్యం కలుగుతుంది.

ప్రసాద్‌కి పదిహేను సంవత్సరాల వయస్సులోనే తల్లి చనిపోవడం, తర్వాత పెద్ద అన్నగారు పోవటం జరుగుతుంది. అందరికన్న చిన్నవాడవడం వల్ల ఇతను ముద్దుగా మురిపెంగా పెరిగాడు. కాని అన్నగారు, తల్లి, చనిపోవటం, పరంపరాగతమైన ఋణము, కుటుంబ బాధ్యతలు వీటన్నిటి భారం ఇతనిమీద పడింది. జీవితంలో ఎదురొన్న కష్టాలు, సమస్యలు వీటన్నిటి ప్రభావం ఇతని సుకోమలమైన మనస్సుమీద పడటంతో ఇతను చలించిపోయినాడు. అప్పటినుండే ఒక విలక్షణమైన ఆలోచనా పద్ధతితో అతను ముందుకు సాగాడు. ప్రసాద్‌తో సన్నిహితంగా వున్న శ్రీ వినోద్ శంకర్ వ్యాస్ ఇలా అన్నారు.

"ప్రసాద్ నాతో తన జీవిత గాథ ఎప్పుడైనా చెప్పినప్పుడు అతనిముఖం ఎఱ్ఱబడిపోయేది కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లేవి. అతని నుదుటిమీద సంసార కఠోరత్వాన్ని తెలియచేసే ఒకగీత దట్టముగా కనబడేది.'

జయశంకర ప్రసాద్ యొక్క చదువంతా ఇంటివద్దనే జరిగిందని చెప్పాలి. హిందీ, సంస్కృతము, ఇంగ్లీషు, బెంగాలీ, ఫారసీ, ఉర్దూ మొదలగు భాషలన్నీ ఇతను అధ్యయనం చేసినాడు. ప్రారంభం నుండీ సంస్కృతమంటే ఇతను చెవి కోసుకొనేవాడు. ప్రాచీన సాహిత్యం, బౌద్ధకాలీన చరిత్ర, వేదాలు, పురాణాలు, ఉపనిషత్తులు, మథించిన ప్రజ్ఞాశాలి ఇతడు. చిన్నప్పటినుండీ ఇతనిలో సాహిత్య పిపాస ఎక్కువనే చెప్పాలి. ఎందరో కవులు, రచయితలు కాశీవచ్చి ఇతన్ని దర్శించకుండా వెళ్ళేవారు కారని అంటారు. ఇతను మొత్తము మూడు వివాహాలు చేసుకున్నాడు. మొదటి ఇద్దరు భార్యలు చనిపోయిన తర్వాత వదినగారి దుఃఖమయ జీవితానికి ఆసరా వుండాలని మూడో వివాహం కూడా చేసుకున్నాడు. అతని 'ఆత్మకథ'లో చెప్పబడిన ఈ కవిత మనస్సును ఆందోళన పరుస్తుంది.

'ఛోటేసే జీవన్ కీ కైసే
   బడే కథాయేం ఆజ్ కహూం'
క్యాయహ్ అచ్ఛానహీ కి
   ఔరోంకీ సునతా మైమౌన్ రహూం?
సున్ కర్ క్యాతుమ్ భలాకరోగే
   మేరీభోలీ ఆత్మకథా?
అభీసమయ్ భీనహీ, థకే సోయీహై
   మేరీ మౌన్ వ్యథా?'

(ఈ చిన్న జీవితంలోని ఎన్నో పెద్ద కథలు ఈరోజు ఎలా చెప్పాలి? ఇతరుల కథవింటూ నేను మౌనంగా వుంటేనే బాగుండదా? నా ఆత్మకథ విని మాత్రం నువ్వేం చేస్తావు? నాలోని మౌనవ్యథ అలసిసొలసి నిద్రిస్తోంది. ఇంక ఇప్పుడు చెప్పే సమయం కూడా లేదు)

ఇంక ఇతని సాహిత్యోపాసనను గురించి గర్వంగా చెప్పాలి. హిందీ సాహిత్యంలో ఎవరూ ఎదుగలేనంత ఎత్తుకి ఎదిగిన గొప్ప కవి ఇతడు. అల్ప అవధిలోనే ఎన్నో కావ్యాలు, నాటకాలు, కథలు వ్రాసిన బహుముఖ

ప్రజ్ఞాశాలి ఇతడు, ఇతని మొదటి కవితా సంగ్రహం 'కానన్ కుసుమ్.' అనే పేరుతో 1911-12 లో ప్రచురించబడ్డది. ఇది కాక ఇంకా 'ప్రేమ్ పథిక్, మహారాణాకా మహత్వ్' అనే కవితా సంకలనాలుకూడా వెలువడ్డాయి. ఆధునిక హిందీ సాహిత్యంలో ఇతనికావ్యాల మీద ఎన్నో పరిశోధనా వ్యాసాలు వెలువడ్డాయి. ఇతని కీర్తికి ముఖ్య కారణం 'కామాయని' మహాకావ్యం. ఈ కావ్యానికి అప్పటిలో 'మంగళా ప్రసాద్ పారితోషికం' లభించింది. బహుశా అప్పటికి జ్ఞాన్ పీఠ్ అవార్డు ప్రవేశ పెట్టి ఉండక పోవచ్చు. ఉండి వుంటే అది ఇతనికి తప్పక లభించి వుండేదని మనము ఊహించవచ్చు. 'కామాయని' కావ్యం కేవలం హిందీ సాహిత్యంలోనే కాక భారతీయ సాహిత్యంలో కూడా మణిపూస అని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఈ కావ్యాన్ని ఇటీవలే డా॥ ఇలపావులూరి పాండురంగారావు గారు పద్యంగానే తెలుగులోనికి అనువదించారు.-

'కామాయని' కావ్యం మనోజ్ఞమైనదీ, మనోవైజ్ఞానిక మైనదీ కూడా అనవచ్చు. మనిషిలోని మానసిక భావాలనే పాత్రలుగా చేసి అంటే మానవీకరణ (Personification) చేసి కావ్యరచన చేసిన ప్రబుద్ధమహాకవి ఈతడు. కామాయనిమహాకావ్యంలోని సర్గల పేర్లు 'చింత' ఆశ, శ్రద్ధ, ఇడ (బుద్ధి), కామ, లజ్జ, రహస్య, దర్శన, ఆనంద 'ఈవిధంగా వుంటాయి. చింతలో ప్రారంభమైన ఈ కావ్యం ఆనందంలో అంతమవుతుంది. ఈ ఆనందం అలౌకికమైనది. స్వయం ప్రకాశితమైనది. కొందరు విమర్శకులు ఈ కావ్యప్రారంభం కవి మహాకావ్యలక్షణాలతో జరపలేదని అంటారు. సంస్కృత కవి కాళిదాసు 'కుమారసంభవం'లో నగాధిరాజవర్ణనతో కావ్యం ప్రారంభముచేసి నట్లుగానే ప్రసాద్ కూడా హిమాలయ పర్వత ప్రారంభంతో ఈకావ్యాన్ని ప్రారంభిస్తాడు ఏమైనా కామాయని మహాకావ్యం ఆనందకావ్యమని అంటే చాలా బాగుంటుంది. మన వైవస్వత మనువు, శ్రద్ధ పాత్రలద్వారా ఈ కావ్యరచన సాగింది. పాత్రలు తక్కువ, కథ చిన్నది కాని విశ్లేషణ బహుదొడ్డది. జీవితానికి సంబంధించిన ఒక చిరంతన సత్యం మనకి 'కామాయని' లో గోచరిస్తుంది. కవి యొక్క భాష మన మనస్సులనే ఆనందపరుస్తుంది. ఇటువంటి కావ్యరచన 'నభూతో నభవిష్యతి' అని చెప్పడంలో ఎటువంటి సందేహం లేదు.

'అంసూ' ప్రసాద్ యొక్క ప్రముఖ గీతికావ్యం. మన తెలుగులోని భావ కవిత్వముతో ఈ గీతికావ్యం సరితూగుతుంది. భావకవిత్వము తెలుగులో వివిధమైన బంగారు పంటలు పండించిందో, హిందీలో ఈ గీతికావ్య పరంపర అదేవిధమైన సామర్థ్యాన్ని పొందింది. ఛాయావాదము అనే వాదం హిందీ సాహిత్యంలో వున్నది. హిందీలోని ఈ ఛాయావాద యుగంలో ప్రసాద్ అగ్రగణ్యుడైనకవి 'అంసూ'లో లౌకిక ప్రేమభావాన్ని, అలౌకికం చేయడం కవి ఉద్దేశము. ఈ గీతికావ్యం చదువుతున్నంతసేపు లౌకికమైన ప్రేమతత్వం ఉద్దామంగా కన్పించినా పాలలోని మీగడలా ఆధ్యాత్మిక తత్వం అంతర్నిహితంగా వుంటూ మన ఆంతరిక నయనాన్ని విస్ఫారితం చేస్తుంది.

'లహర్ ఝరనా' గీతికావ్యాలలో కవి యొక్క వ్యక్తిగతఅనుభూతులు, ప్రకృతి చిత్రణ, యౌవనప్రేమభావాలు ఎంతో హృద్యంగా వర్ణించబడ్డాయి. ప్రసాద్ లోని గొప్ప విషయమేమంటే అతను ప్రతీకలు కావ్యంలో ఎక్కువగా ప్రవేశపెట్టాడు. ప్రకృతిని మానవీకరణ చేసాడు. పరమాత్మ యొక్క తాదాత్మ్యం అతని కవితలలో స్పష్టంగా కానవస్తుంది ఇదికాక ఎన్నో కవితలు, కవితా సంగ్రహాలు ఆయన వ్రాయనే వ్రాశాడు. ప్రణయ భావానికి అతను ఎంతో ప్రాధాన్యం ఇచ్చాడు. విప్రలంభ శృంగారం అధికంగానే ఇతని కవితలలో కానవస్తుంది.

ఇంక ప్రసాద్ యొక్క నాటకరచన గురించి చెప్పాలి. ఇతను ఒకటి, రెండూ కాదు. పదమూడు నాటకాలు వ్రాసాడు. స్కందగుప్త, చంద్రగుప్త, అజాతశత్రు, జనమేజయ్ కా నాగయజ్ఞ మొదలైన నాటకాలు ఇతని కీర్తిని ఇనుమడింపచేసాయి. భారతీయత అన్నా, ప్రాచీన సభ్యత, సంప్రదాయం అన్నా ఇతనికి ఎంతో ఇష్టం. ఆయన నాటకాలలో గొప్ప వైవిధ్యం వున్నది. ఇంగ్లీషులో ప్రముఖ నాటకకర్తగా షేక్స్పియర్ ను మనము ఎలా గౌరవిస్తామో, హిందీనాటకరంగంలో అంతగౌరవాన్ని ఇతను పొందినాడు. నాటకాలలో కూడా గీతాల్ని ప్రవేశపెట్టినవాడు ఈతడు. ఆ గీతాలలోని భావరమ్యత మనసుల్ని పరవశింపచేస్తుంది.

'కంకాల్, తితలీ, ఇరావతీ' ఇతని నవలలు. ఇవేకాక 'ఛాయా' 'ప్రతిధ్వని,' 'ఆకాశదీప్,' 'ఆంధీ' మొదలైనవి ఇతని కథాసంగ్రహాలు ఇతని కథలలోని భాష కడురమ్యమైనది. మంచి నిగూఢార్థము వాటిలో వుండనే వుంది.

ఆధునిక హిందీ సాహిత్యంలో మహాకవిగా ప్రముఖనాటక రచయితగా, కథకుడిగా ఎన్నో బహుముఖమైన ప్రక్రియలలో రచనా వ్యాసంగము చేసిన ప్రతిభావంతుడు జయశంకర ప్రసాద్.

( తరువాయి 19 వ పేజీలో )

# నవ్యకవితా యుగోదయశ్రీ "ఉదయశ్రీ"

డా॥ జి. బి. ఎస్ ఆచార్య, ఎం. ఏ. పిహెచ్. డి.

'నవ్యకవితా యుగోదయశ్రీ'1 అని కీర్తింపబడిన 'ఉదయశ్రీ' (ప్ర. భా. ప్రచురణ 1944) కావ్యము కరుణశ్రీ కవితాకాశమున మహోజ్జ్వలముగ భాసించు ధ్రువతార — తెలుగు గుండెలను మధురముగ స్పందింపజేయు నితార. ఉదయశ్రీ లోని ప్రతిఖండిక ఒక రసవాహిక - సరసభావ ప్రదీపిక. పదలాలిత్యము కరుణశ్రీ సొత్తు - అందుకే ఆయన కీర్తి హిమగిరి శృంగమంత ఎత్తు.

'లోకాల చీకట్లు పోకార్ప రవిచంద్ర
  దీపాలు గగనాన త్రిప్పలేక
జగతిపై బడవచ్చు జలరాశి కెరటాలు
  మామూలు మేరకు మడవలేక
పనిమాలి ప్రతిరోజు ప్రాణికోటులగుండె
  గడియారముల కీలు కదపలేక
అందాలు చింద నీలాకాశ వేదిపై
  చుక్కల ముగ్గులు చెక్కలేక'

శ్రమ నందుచుండిన విరాట్ స్వరూపునకు కేవలము సానుభూతి పలుకుటే గాదు - 'గుండె కుదిలించి హృదయ పుష్పాంజలు' లను కుప్పవోసిన భక్త శిఖామణి కరుణశ్రీ అమృత ఝరి చిందు పరమేశ్వరుని పదాంకముల యందు కోటి స్వర్గాలను మొలపించు కోనగలిగిన ఉత్తమ భావుకులు.

'పుట్టబోయెడి బుల్లిబుజ్జాయి కోసమై
  పొదుగు గిన్నెకు పాలు పోసిపోసి
కలికి వెన్నెల లూరు చలువ దోసిళ్లతో
  లతలకు మారాకు లతికి యతికి
పూలకంచాలలో రోలంబములకు తే
  నటిభోజనము సిద్ధపఱచి పఱచి
తెలవాఱకుండ మొగ్గలలోన జొరబడి
  వింత వింతల రంగు వేసివేసి
తీరికే లేని విశ్వ సంసారమందు
అలసిపోయితి వేమొ దేవాదిదేవ!
ఒకని మేషమ్ము కన్ను మూయుదువుగాని
రమ్ము! తెఱచితి మా కుటీరమ్ము తలుపు!'

అని పరమేశ్వరునకు ప్రార్థనాంజలి ఘటించినారు. పరమేశ్వరుని వింత మహిమలకు విస్తుపోయి 'సుతిమెత్త'ని భావ ప్రసూన మాలికలను భగవంతునకు కైసేసినారు. ఈ ఒరవడిని సమకాలీన కవియైన 'జాషువ' గారి వద్దనుండి కరుణశ్రీ స్వీకరించినారు.2 తమకు నచ్చిన కవితా పద్ధతులను ఒకరి నుండి మరియొకరు గ్రహించుట మన కవిత్వములో ప్రచురమైన విషయమే.

'Mystics' ప్రపంచములోని సర్వ పదార్థములలో పరమాత్మ స్వరూపమును దర్శింతురు. సర్వము భగవన్మయము అను తత్త్వము మనకు క్రొత్త గాదు. భారతీయ తత్త్వశాస్త్రమంతయు ఈ సిద్ధాంతము మీదనే ఆధారపడియున్నది. పాశ్చాత్యులన్న 'మిస్టిక్' కవులకు, ప్రాచ్యకవుల 'భక్త' కవులకు భేదమేమియు లేదని చెప్పవచ్చును. దృశ్య ప్రపంచములోని ప్రతి పదార్థము ఏద ఒక అతీతశక్తికి, అదృశ్య శక్తికి ప్రతీ యను భావము 'మిస్టిసిజము' (భ తత్త్వము) నకు దారితీసినది ఆ అతీ శక్తికి, అదృశ్యశక్తికి 'భగవంతుడు' అ నామకరణము చేసి నుతి సలుపు విధా నము ప్రారంభమైనది. పైపద్యములో 'కరుణశ్రీ' భగవదారాధన భావకవిత్ మందలి 'భక్తికవిత్వ' మను శాఖకు చెం నది. 'ఉషస్సు' అనుఖండికలో -

'కర్కశ కరాళ కాలమేఘాలనీడ
తెగురు చున్నవి ప్రజలనెమ్మొగములందు
క్రౌర్య కౌటిల్య గాఢాంధకార పటలి
క్రమ్ముకొన్నది దిగ్దిగంతమ్ములెల్ల'.

అని భీభత్సమును వర్ణించినను 'వే యవో ప్రాభాత శోభావళుల్' అని తన ఆశాభావమును వెల్లడించుటయే గాక నిర్జీవప్రపంచమునకు స్మితశ్రీ చైతన్య న ప్రభాతముల ప్రసాదమును ఆకాంక్షించి నారు.

'మా, ప్రాచీబాల కపోలపాళికలపై
  ప్రత్యూష సౌవర్ణ
రేఖాచిత్రమ్ములు గీతురెవ్వరను రా
  స్విన్న హస్తాలతో!'

అనిన కవిగారి ఉదయశ్రీ 'గౌతమ బుద్ధుని చిరునవ్వులోన పులకీకృతమై వెల్లివిరిసినది. శ్రీమతిని, చిరంజీవిని కిరీటమును, ఉజ్జగించి విశ్వకల్యాణగవేషణకై ఆరంభించిన 'ఈ మహాభినిష్క్రమణ కర్థమేమి కలదో?' అని కవిగారు వేసికొనిన ప్రశ్నకు వ్యాఖ్యానమై 'ఉదయశ్రీ' వికసించినది.

'ఉదయశ్రీ' అను ఖండికలో - చీకాకై పోయిన చీకటి లోకమును, కరుణా కమలాకర, తరుణ ప్రభాకరుని శ్రీకరములతో సంస్పృశింపగవలెనని వేడుకొనినారు.

'ఉత్తిష్ఠ' అను ఖండికలో - కరుణా కళాధరుడైన బుద్ధుని క్షేమదసైక వృష్టి

---

( 18 వ పేజీ తరువాయి )

'కామాయని' కావ్యరచన ప్రారంభము చేసేసరికే ఇతనిలో క్షయవ్యాధి అంకురించి వుంది. ఆనందకావ్యం 'కామాయని' వ్రాసి తనకావ్య వైభవాన్ని నలుదెసలా ప్రసరింపచేసి మిక్కిలి తక్కువ వయస్సులోనే ఇతను విశ్వేశ్వరధామము చేరిపోయినాడు. కాశీలో విశ్వేశ్వరుడు స్మరణకి వచ్చినపుడు, ఈ జయశంకరుడు కూడా జ్ఞప్తికి రాకపోడుకదా. ఇంకను ఇతను జీవించివుంటే ఎన్నో కమనీయ కావ్య ప్రసూనాలు భారత - భారతికి అందించి వుండేవాడేమో మనకిక ఆ అదృష్టము లేదు.

—•••—

కాంక్షించుటయే కాక ఈ మహిని స్వర్గ ఖండ మొనరింపు మని ప్రార్థించినారు

'కరుణా కుమారి' అను ఖండికలో – కరుణకు అక్షరాకృతి నొసగినారు 'భవభూతి' ప్రతిపాదించిన 'ఏకో రసః కరుణ ఏవ' అను సిద్ధాంతము కవిగారి కాదర్శము అదే వీరి కవితలలోని విశేషము కవిగారి కరుణా కుమారి 'భువనైక మోహిని, అమృతమయి, అనంత విశ్వవిహారిణి, శాంతమూర్తి, లోకైక పావని' 'ఆమెవంటి అందముల రాణి లేదు బ్రహ్మాండమందు' అని కవిగారు మురిసి పోయినారు ఆమె నిత్యకల్యాణి, ఆర్ద్రత, అహింస, అనసూయ ఆమె యింటి ఆడుబిడ్డలు ఈ చరాచర జగత్తు ఆమె మానస కమలాకరాంతమున తేలు జలజము బాల భానుని పసిడి హస్తాలతో తన పాదములకు పసుపు పారాణిని పూయించు కొనగలిగిన ఆమె యదృష్టము వర్ణనాతీతము

'ఆమె హృదయము హృదయాన నందు
కొనక
సార్థకత లేదు నా నరజన్మమునకు'

అని కవిగారు నరజన్మ సార్థకతకు మార్గమును చూపించినారు కవి 'మార్గదర్శి' యగుట ముదావహమైన విషయము గదా!

'బుద్ధభగవాను గారాబు పుత్రి–ఆమె
నవ్యసుకుమారి 'శ్రీ కరుణాకుమారి''

అని 'కరుణ' యొక్క వైశిష్ట్యమును వెల్లడించినారు 'కరుణ' – 'బుద్ధుడు' ఈ యిరువురిలో నెవరివలన నెవరికి పేరు ప్రతిష్ఠలు – లోకసమాదరణ లభించినవో చెప్పుట కష్టమైనప్పటికిని, కరుణశ్రీ వలన ఈ యిరువురకు ఆ రాధనా గౌరవము దక్కినదని నిస్సంకోచముగా చెప్పవచ్చును ముందు కరుణకు మ్రొక్కియే బుద్ధుని స్తుతి కుపక్రమింపవలెనని కరుణశ్రీ తీర్పు అన్నను దోషము కాదు

'కరుణామయి' అను ఖండికలో – నిరపరాధ, అనురాగ భావ సారాధన మగ్నమానస, అయిన రాధ యొక్క నిర్మలప్రేమ భావైక హృదయమును చదువుకొనుడని విప్పి మన ముందుంచినారు కరుణశ్రీ 'రాధ' అందరి వంటిది గాదు

'శ్రీయుత మూర్తియై కరుణ
చిందెడి చూపులతోడ స్వామి వేం
చేయును, పాదపూజ దయసేయును'

అను సంబరముతో ఎదురుచూపులు చూచెడి వేళ దృగంచలమ్ముల ద్రవించి ప్రవించు మనోనురాగములను దాచుకొనగ లేని పసిబాల

'ఏది మఱొక్క మాటు హృద
యేశ్వర! గుండెలు పుల్కరింపగా
ఊదగదోయి! ఊదగదవోయి!'

అని వేడుకొనిన వేణుగీతికా రసపిపాసిని మధురభక్తి కవిత్వమున శ్రీకృష్ణుని వేణుగానమునకు అత్యంతప్రాధాన్యమున్నది ఈ కవిత వెలయించినవారు వేణుగానమును వర్ణింపక విడువలేదు ఇచ్చట కవిగారు రాధ ముఖమున కృష్ణుని నర్థించినారు

'పారవశ్యము' అను ఖండిక ఒక ప్రకృతి చిత్రము

'అది శరద్రాత్రి, గగన సౌధాంగణమున
దేవతాస్త్రీలు దీపాలు తీర్చినారు,
సరస రాకాసుధాకర కిరణములందు
కలకలమటంచు నవ్వె శృంగారసరసి'[3]

అని శరద్రాత్రియొక్క ముగ్ధమనోరత్వమును మధురముగా వర్ణించినారు ఇంకను నవనవానంద బృందావన వీథులలో ప్రణయకుపితయై కూర్చున్న రాధిక చిత్తవృత్తిని, 'రాధికా మానసవిహార రాజహంస' మైన కృష్ణుని 'దాక్షిణ్య' స్వభావమును మనోజ్ఞముగా వర్ణించినారు

'రాధికా క్రోధ మధురాధరమ్ము కింత
నవ్వెనో లేదో! పకపక నవ్వె ప్రకృతి,
నవ్వుకొన్నది బృందావనమ్ము, యమున
నవ్వుకొన్నది, చంద్రుడు నవ్వినాడు,
విరుగబడి తమ పొట్టలు విచ్చిపోవ
నవ్వినవి రాధ తలలోని పువ్వులెల్ల'

అని బహుచమత్కారముగా సమస్త ప్రకృతి చేతను నవ్వింప గలిగిన కరుణశ్రీ కవితారసజ్ఞత రసహృదయుల కాస్వాదయోగ్యము, అవ్యక్త మధురానంద సంధాయకము బృందావనము చేత, యమునచేత, చంద్రుని చేత, ఏకవియైనను నవ్వింపగలడు కాని రాధతలలోని పువ్వులచేత నవ్వించుట–అందునను 'విరుగబడి తమ పొట్టలు విచ్చిపోవ' నవ్వించుట కరుణశ్రీ కొక్కరికే శక్యమైనపని ఇటువంటి విషయములందే కవియొక్క ప్రజ్ఞాపాటవములు వెల్లడియగు చుండును సామాన్య కవులకోవను అతిక్రమింప గలుగుటకు ఏదేని కవియొక్క ప్రత్యేకముద్రయొకటి యుండవలయును అటువంటి ప్రత్యేకముద్ర కరుణశ్రీకవిత్వమున ప్రస్ఫుటముగ గోచరించుచుండును

'రాధపై ప్రేమ మధికమో మాధవునకు
మాధవునిపైని రాధ ప్రేమయె ఘనమ్మొ'

అను మధుర జిజ్ఞాసను రేకెత్తించి, తనతోపాటు పాఠకులను సైతము పారవశ్యమున ముంచి ఈ మధురకృతి ముగింపునకు మంచి బిగింపును కూర్చినారు.

'అద్వైతమూర్తి' అను ఖండికలో–

'భావోద్యానము నందు క్రొత్తవలపుం
బందిళ్ళలో కోరికల్
తీవల్ సాగెను పూలు పూచెను, రసా
ర్ద్రీభూత చేతమ్ముతో
'నీవే నేనుగ' 'నేనె నీవుగ' లతాంగీ,
యేకమై పోదమా
ప్రావృణ్ణీరద పంక్తి క్రింద పులకిం
పన్ పూర్వపుణ్యావళుల్'

అని ప్రేయసీ ప్రియుల తాదాత్మ్యస్థితిని వర్ణించినారు ఇచ్చట ప్రియుడు–కవితాప్రియు డగుటచేత పై పద్యములో 'భావోద్యానము', తరువాతి పద్యములో 'కవితాకాళింది' అని ప్రయోగింపబడినవి. 'నీవే నేనుగ' 'నేనే నీవుగ'

అనుటలోని అద్వైత భావన వేదాంత తత్త్వమును స్ఫురింప జేయుచున్నది.

'సాంధ్యశ్రీ' అనుకృతిలో 'సంజ వెలుంగులో పసిడిచాయల ఖద్దరు చీర గట్టి నారింజకు నీళ్లువోయు శశిరేఖ' మనోహరాకృతి దృగ్గోచరమగును. 'రంజితపాణి పల్లవము రాయు సుభద్రసూతి' ప్రత్యక్షమగును శశిరేఖ, సుభద్రసూతి అను పౌరాణిక నామముల స్వీకారము చేత కవిగారు తమ సంప్రదాయాభిజ్ఞతను స్ఫుటతర మొనరించినారు శశిరేఖ చేత సైతము ఖద్దరు చీర కట్టించిన కవిగారి జాతీయతాభావము శ్లాఘాపాత్రమైనది

(సశేషం)

---

1 ప్రఫుల్ల సౌగంధికము ('ఉదయశ్రీ' కావ్యమునకు పీఠిక)-
డా. నండూరి రామకృష్ణమాచార్య.
పుట. 16

3. ఈపద్యము దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి 'అన్వేషణము' లోని-
'ఆదిశరద్రాత్రి శీతచంద్రాతపాంత
రాళ రమణీయ రజత తల్పంబునందు
సకల గోపాల గోపికా జనముతోడ'
అను పద్యమును తలపింపఁ జేయుచున్నది

2. 'విత్తనంబున మహావృక్షమ్ము నిమిడించి
సృష్టించి గారడీ సేయువాఁడ
కడుపులో శిశువును గల్పించిపది నెలల్
మోయించి యూపిరి వోయువాఁడ
సద్భక్తవరులకు సాక్షాత్కరించియు
నున్నచో తెలిఁగింప కున్నవాఁడ
పొటమరింపక ముందె పుష్పసంతతులకు
వింతగా రంగులు వేయువాఁడ
చెలువ మొప్పఁ బుడమి సృష్టించి మాకిచ్చి
అనుభవింపుఁ డనుచు నానతిచ్చి
నిలువనీడ లేక నిల్చిన కలవాఁడ!
కడుపునిండ నన్నుఁ గన్నవాఁడ!'
—పిరదౌసి (ప్రచురణ · 1832)
పద్య. 71

## "భాస్కరోపగ్రహస్య ప్రస్తుతిః"

— శ్రీ ఆర్. యం. చల్లా.

1. యైషా భారతభారతీ స్వరఝురీ, సాహిత్య సమ్భూషితా,
సమ్పూర్వార్యాద్య రసామృతత్రిపథగాం, స్వాతన్త్ర్య దివ్యోత్సవే ।
శ్రోతౄణాం హృదయం వినోదయతివై, సమ్భావ్య కావ్యాత్మనా,
తాం వన్దే కవితా ప్రసార వరదాం ఆకాశవాణీం ముదా ॥

2. సాక్షాద్భాస్కర ఏవ భౌతిక జగత్ పుష్ణాతి శక్త్యాత్మనః
తస్మాత్తస్యకృతే ప్రగాయతి యథా భక్తః ప్రభాతే స్తుతిమ్ ।
రోదస్యాః పరిశోధనాధ్వని తతాః శాస్త్రార్థ పారఙ్గతాః
గాయన్త్యేవహి భాస్కరాహ్వయ మిదం దైవజ్ఞయుగ్మం తథా ॥

3 భూగోళే చ ఖగోళే చ జ్ఞాతవ్యం యచ్చ శాస్త్రతః ।
భాస్కరాభ్యాం నిరుక్తం తత్ జ్యోతిర్గణిత శాస్త్రయోః ॥

4. వ్యాఖ్యాన మార్యభట్టీయం తయో రేక స్తు నిర్మమే ।
లీలావత్యాఖ్య గణితం ద్వితీయో భాస్కరోఽలిఖత్ ॥

5. భాస్కరోపగ్రహోఽయం వై భూగతం పరిశోధతే ।
రేడియో టి. వి. యన్త్రాభ్యాం విపృణో త్యస్య వర్ధనమ్ ॥

6. భోభో తత్త్వవిచార భాస్కర వియచ్చారిన్, ప్రయోగవ్రతిన్,
పశ్య త్వం భువనం యథా గ్రహపతి ర్యన్నామధేయో భవాన్ ।
అస్మభ్యం వరదాయకో భవ యథాస్యామాత్ర సర్వే వయం
భోక్తారోఽవని సమ్పదా మపి చ సద్ధాతార ఏ వాన్వహమ్ ॥

7, ఆః కష్టం త్వనుభూయ తేఽద్య విఫలం దైవేన యన్త్రం యతో
మాభైషీః; తవ దూరదర్శన మదః తద్జ్ఞైః పున స్సార్యతే ।
తచ్ఛాస్త్రజ్ఞ పరిష్కృతాధ్వనిగత స్త్వం సాధుకృద్రీతిభిః
సంజ్ఞాభి స్తవ సాధనాని విధివ న్మార్గే నయాఽతః పరమ్ ॥

8. ప్రద్యోత నోఽసౌ దేవోఽపి గ్రస్యతే నను రాహుణా ?
అనివార్య మిదం ప్రాయో దుష్ట సమ్పీడనం సతామ్ ॥

9. అనుభూయ నరో దుఃఖం సుఖం భుఙ్క్తే తతోఽధికమ్ ।
ఏవమేవ భవాన్ భూయో నితాన్తం సుభగో భవేత్ ॥

10. సమ్యగ్దృష్టు మథార్హసి క్షితిగతా నర్థాంశ్చ, యద్దర్శనాత్
సర్వోయం జలభూతలాన్తరగతా సమ్పద్విధేయా భవేత్ ।
కృత్వాన్వర్థ మపి త్వదాహ్వయ మిదం భాసో వితన్వన్ ముహుః
ప్రాగ్వత్ 'శ్రీహరికోట' వైష్ణవపదం సమ్ప్రాప్నుయా భాస్కర ॥

11. జయతు భాస్కరోపగ్రహో జయతు
జయతు సాధక శ్శాస్త్రవి జ్జయతు ।
జయతు భారతం సన్తతం జయతు
జయతు దేవతా భారతీ జయతు ॥

(ఆకాశవాణి, విశాఖపట్టణం వారి సౌజన్యంతో)

# గ్రంథ సమాలోచన

## భీష్మ చరిత్ర

(శ్రీ కావూరి పూర్ణచంద్రరావు, ఎం.ఏ. బి.ఒ.ఎల్. 18-4-66. 11 లైను, కేదారేశ్వరపేట, విజయవాడ. వెల 4 రు)

భారతీయులందర కిష్టమైనది మహాభారతము. అందలి పాత్రచిత్రణ కథాగమనము ప్రతివారి నాకట్టుకొనును. భారత పాత్రలలో భీష్మునిపాత్ర విచిత్రగంభీరము, ధార్మికము. అట్టిభీష్ముని చరిత్రను పలువురు కావ్యముగ రచించిరి. అట్లు రచించిన వారిలో శ్రీకావూరి పూర్ణచంద్రరావుగా రొకరు. వీరికి పద్యరచనపై గల యభినివేశము ప్రశంసనీయము. పద్యరచనకు కలసిన పదసంపత్తి వీరికి దాదాపుగ గలదు. ధారయు సముచిత ప్రాయమే.

జననము, ప్రతిజ్ఞ, పరీక్ష, శరతల్పము అను నాలుగు ఖండములుగ భీష్ముని చరిత్రను సుమారు మూడువందల పద్యములలో నవీనపద్ధతిలో నిర్వహించిరి. జననములో మహాభిషుని శాపము, శంతనుడుగా పుట్టుట, గంగాశంతనుల విచ్ఛేదము వర్ణితములు. ప్రతిజ్ఞలో శంతనుని పుత్రప్రాప్తి, భీష్ముని యౌవరాజ్యము, శంతనుడు సత్యవతిని చూచి మోహపడుట, దాశరాజడిగిన శుల్కమీయలేక విచారపడుట, గూఢచారి యావృత్తాంతమును వృద్ధమంత్రికిఁ జెప్పుట, భీష్ముడు మంత్రినుండి యావృత్తమును విని దాశరాజు కోర్కెలనుదీర్చి సత్యవతిని దెచ్చి తండ్రికిడుట వర్ణింపబడినవి. పరీక్షలో సత్యవతీకుమారునికై భీష్ముడు కాశిరాజకుమార్తెలదెచ్చుట, అంబ సాళ్వానురాగము నెరిగి యామెను పంపుట, ఆమె వానిచే పరిత్యక్తయై భీష్ముని కడకువచ్చి వానిచేతను పరిత్యక్తయగుట, తపశ్చరణము, పరశురాముని యభయము, రామభీష్ముల యుద్ధము, భీష్ముని విజయము, క్రుద్ధయగు అంబ తపస్సుచే శివునివరము లకుగుట, పరీక్షలోఁ గలవు. శరతల్పములో భీష్ముని యుద్ధము, ధర్మరాజుపై దయచూపి తనవధోపాయము నెరిగించుట, అంపశయ్య మున్నగునవి కలవు.

వీరీ కథను నిర్వహించుటలో కొన్ని మార్పులను గావించిరి. బ్రహ్మసభలో గంగ వలువలు వాతోహతిఁ దూలఁ బరమాసక్తుడై చూచిన మహాభిషుని బ్రహ్మ శపించెను. భారతములో గంగకు కూడ మహాభిషునిపై ననురాగము కల్గినట్లు చెప్పబడగా వీరు దాని నింతు విడిచిరి. కారణ మనూహ్యము. శంతనుని సత్యవతీ విరహమును గూఢచారి ప్రజల వలన విని మంత్రికి జెప్ప వానినుండి భీష్ముడు విన్నట్లు కల్పించుట వలన పద్యముల సంఖ్య పెరుగ వీలైనది. దీని వలనఁ గలిగిన ప్రయోజనమును మృగ్యమే. గంగా శంతనుల సాంగత్యము గంగాతీరమున జరిగినట్లు మూలములోనుండగ దీనిని రాజగృహమున జరిగినట్లు చెప్పుట యేలనో? అట్లే దాశరాజుకడ భీష్ముడు రాజ్యత్యాగము వివాహత్యాగమును జేయుట రెండు నొక్కసారిగఁ జెప్పబడినవి. ఇట్లుచేయుటవలన దాశరాజు కౌటిల్యము మాటుపడును. వీరు దీనిని గమనింపక యది భీష్మునిపాత్ర కుద్దీపకముగ గ్రహించిరి.

పరశురాము డంబను భీష్ముని తమ్మునికై గ్రహింపు మనెను గాని భీష్ము నే పరిణయమాడు మనలేదు. ఇది మూలములో లేదు. అంబను పరిణయమాడుమని పరశురామునిచే ననిపించుట భీష్ముని పాత్రకుగాని పరశురాముని పాత్రకుగాని సముచితము గాదు. ఇట్లు పలువిధములుగా భీష్ముని పాత్రచిత్రణ మూలముకంటె నిస్తేజస్కమైనది. మూలములోని భీష్ముడు కాశిరాజదుహితలను దెచ్చినప్పుడు, అంబను పంపునపుడు, పరశురామునితో యుద్ధముగావించునప్పుడు సత్యవతిని సంప్రదించునుకాని యిందట్లు కాలేదు. కారణము తెలియదు. సత్యవతిచే ప్రార్థితుడయ్యు భీష్ముడు వివాహమాడక పోవుట భారతములోనుండ నది యిందు విడువబడినది. సమ్మోహనాస్త్ర వృత్తాంతము విడువబడినది. స్వయంవర వర్ణనాదికము విడచి దీనిని గ్రహించిన బాగుండెడిది. చివరభీష్ముడు ధర్మరాజున కుపదేశించిన ధర్మాదికములను సంగ్రహముగఁ జెప్పి వాని శరీరత్యాగమును వర్ణించినచో భీష్మునిచరిత్ర సమగ్రమయ్యెడిది. వీరు మరింత భావన చేసి మరింత యేకాగ్రత వహించినచో మరింత బాగుండెడిది.

సుసమర్థులైన (3వ పేజీ) బహుదాహపరీత (౧ వ పేజీ) (ఇట దాహపదమునకు తెలుగులోని యర్థము వేరు సంస్కృతములోని యర్థము వేఱు) పూత (5 పేజీ) పునీత (19 పేజీ) సౌంజ్ఞ (34) వంటి ప్రయోగములు విచారణీయములు. కవికి కవితారచనకు ముఖ్యంగా పదానుశీలన, మున్నగునవి, భావనాపరిశుద్ధస్ఫూర్తి, యవసరములు. అవి యింకను నుండవలెను.

అయినను పద్యరచన బూజుపట్టి మూలపడిన యిట్టి రోజులలో నీపాటిపద్యముల రాకడ ప్రశంసనీయమే. జాయాభాగ్యసుఖోపభోగలగుచున్ (21 పే) ఎఱిగిన జాడ్కులం గనియె నింతిని శంతనుడంత (7 పే) వంటి పద్యము లనేకములు పాఠకుల నాకర్షించును. పదవిన్యాసము, పద్యనిర్వహణము, కథా, సంవిధానము, మున్నగునవి చాల బాగున్నవి.

పద్యములు పాఠకుని పరనాభిలాషను కొనసాగించును. పద్యములకు సంఖ్యనీయలేదు. ఇచ్చిన బాగుండెడిది. ముద్రణ నిర్దుష్టమై మనోహరమై యున్నది. శ్రీకవిగారు ప్రయత్నించినచో మరిన్ని కృతులను మరింత మనోహరముగా రచించి పాఠకుల నానందింప జేయగలరు. వీరికిగల భాషాసంపద, భావనా బలము, కల్పనాచాతురి, పద్యనిర్వహణము అట్టివి. వీరు పాఠకుల యాశలను కొనసాగింపగలవారు. సందేహము లేదు. *

డా॥ నారపరాజు శ్రీధరరాయకః
(M B B S D T M చీరాల)

బహూకరణము – 1979.

# ఈ పక్షంలో

## కృతిసమర్పణ, గ్రంథావిష్కరణ కవుల సన్మానోత్సవములు

19-8-79 వ తేదీ విజయవాడలోని శ్రీ సర్వోత్తమ భవనమున ఉదయం రెండు పుస్తకాల కృతి సమర్పణోత్సవం, సాయంత్రం రెండు పుస్తకాల ఆవిష్కరణ కార్యక్రమం నడచినవి

ఉదయం 10 గంటలకు ప్రారంభమైన సమావేశానికి 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రిగారధ్యక్షత వహించారు

'కళాప్రపూర్ణ' శ్రీ పాతూరి నాగభూషణం తాము సిద్ధపరచిన 2 గ్రంథాలలో ఒకటి భర్తృహరి వైరాగ్య శతకం ఏనుగు లక్ష్మణకవి తెలుగు పద్యాలకు టీకా తాత్పర్యము దీనిని ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు స్థాపకులు కీ శే కొమ్మా సీతారామయ్య, గ్రామసేవా గ్రంథమాల స్థాపకులు కర్షకతపస్వి కీ శే గోటేటి జోగిరాజు గార్లకు అంకితమిచ్చినారు

రెండవది గ్రంథాలయములు వ్యాసావళి నాలుగవ భాగం గ్రంథాలయోద్యమంలోని ప్రముఖులతోపాటు, డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి, మామిడిపూడి వెంకటరంగయ్య వంటి విద్యావేత్తలు, సర్వశ్రీ కోరాడ రామకృష్ణయ్య, బులుసు వెంకటరమణయ్య వంటి పండితులు అనుభవజ్ఞులైన గ్రంథాలయశాస్త్ర వేత్తలు గ్రంథాలయాలకు సంబంధించిన వివిధ అంశములపై వ్రాసిన రచనలు, 21 దీనిలో నున్నవి ఈ గ్రంథమును ఆంధ్రదేశంలో గ్రామసీమలలో ఉన్నత పాఠశాలలను విరివిగా నెలకొల్పి సామాన్యులు సహితం సులభంగా ఉన్నతవిద్య నభ్యసించుటకు మార్గము చూపిన కీ శే పాములపాటి వెంకటకృష్ణయ్యచౌదరి గారికి సమర్పించినారు

అధ్యక్షులతోపాటు యీ సభలో పాల్గొన్న వక్తలు ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు అధ్యక్షులు శ్రీ నాగినేని వెంకయ్య ఉపాధ్యక్షులు శ్రీ పావులూరి శివనారాయణ, సుప్రసిద్ధ సాంఘిక సేవకురాలు శ్రీమతి చెన్నుపాటి విద్య, గ్రంథాలయ సంఘ కార్యదర్శి శ్రీ మేడూరి శివరామయ్య, పశ్చిమగోదావరిజిల్లా గ్రంథాలయసంస్థ అధ్యక్షులు శ్రీ గద్దె రామరామమూర్తి యీ కృతుల నిర్మాత శ్రీ పాతూరివారి భాషాసేవను గురించి, కృతిభర్తల గుణవిశేషములనుగురించి ప్రశంసాపూర్వకమైన ప్రసంగాలను గావించినారు శ్రీపాతూరి వందన సమర్పణతో సమావేశము ముగిసినది

సాయంత్రం 5 గంటలకు ప్రారంభమైన సమావేశానికి 'కవిసమ్రాట్', శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారధ్యక్షత వహించినారు

ఆంధ్రగ్రంథాలయట్రస్టు కార్యదర్శి శ్రీ ఆర్ దివ్యప్రభాకర్ గారు సభానిర్వాహకులను పరిచయంచేసిన పిమ్మట శ్రీ పావులూరి శివనారాయణగారు స్వాగతం పలికారు అధ్యక్షుల తొలిపలుకుల పిమ్మట 12 సంవత్సరాలనాడు జరిగిన పాతూరి షష్టిపూర్తి సందర్భములో 100 మందికిపైగా అభిమానులు వ్రాసి పంపిన అభివందన పూర్వక కవితలు, లేఖలు, 'అభినందన వందనం' అను గ్రంథాన్ని ప్రముఖ విద్యాపోషకులు, ఆంధ్రప్రదేశ్ విధానసభ సభ్యులు శ్రీ చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాద మూర్తిరాజుగారు ఆవిష్కరిస్తూ పాతూరివారి ఆదర్శసేవను గురించి, నేటి విద్యా విధానంలోని లోపాలను గురించి ప్రసంగించినారు పాతూరివారు సంపాదకులుగా నుండి వెలువరించిన సర్వోత్తమ ప్రచురణలలోని మొదటిగ్రంథము భర్తృహరి నీతిశతకము-లక్ష్మణకవి పద్యములు సమగ్ర వ్యాఖ్యానమును కరుణశ్రీ చక్కగా సమీక్ష చేసినారు

ఆ తర్వాత శ్రీ పాపయ్యశాస్త్రిగారితోపాటు, శ్రీ విశ్వనాథ వెంకటేశ్వర్లు గారిని ఆంధ్ర గ్రంథాలయట్రస్టు పక్షాన అధ్యక్ష కార్యదర్శులు శ్రీ నాగినేని వెంకయ్య, శ్రీ పాతూరి నాగభూషణం సన్మానించినారు

ఈ సభలో సిద్ధార్థ కాలేజీ ఆంధ్రోపన్యాసకులు శ్రీ సి సి జగన్నాథరావు గారు ప్రసంగిస్తూ శ్రీ నాగభూషణంగారత్యంత శ్రద్ధతో సిద్ధపరచిన ఈ రెండు గ్రంథాన్ని శ్రీ పాపయ్యశాస్త్రిగారు ఆవిష్కరించడం ఉదాత్తంగా ఉందని సెలవిచ్చారు శ్రీ దివ్యప్రభాకర్, కృష్ణాజిల్లాపరిషత్ మాజీ ఉపాధ్యక్షురాలు శ్రీ సూర్యదేవర అన్నపూర్ణమ్మ, మానవాదర్శ గ్రంథమండలి వ్యవస్థాపకులు శ్రీ తిపిర్నేని లక్ష్మీనారాయణ గారు తమ ప్రసంగంలో ఈనాడు దేశంలో నీతి పూర్తిగా కొరవడడానికి కారణమైన సినిమాలను పూర్తిగా నిషేధించాలని, దేశంలో అపురూపంగా నున్న నీతిని వ్యాపింపజేయుటకు భర్తృహరి నీతిశతకం చాల ఉపయోగపడునని చెప్పారు.

శ్రీ గద్దె రామమూర్తిగారి వందనసమర్పణతో ఈ కార్యక్రమం సమాప్తమైనది.

మరునాడు శ్రీ పాతూరివారి జన్మదినోత్సవాన్ని గ్రంథాలయ శిక్షణాలయం 16వ జట్టు విద్యార్థులు జరిపి వారికి, కాశ్మీరుశాలువను, కొన్ని ఉద్గ్రంథాలను బహూకరించారు ఈ సభకు పావులూరి శివనారాయణగారధ్యక్షత వహించారు కొందరు విద్యార్థులు గ్రామంలో పెద్దలు ఉత్తేజకరమైన ఉపన్యాసాలు చేశారు. పాతూరివారు ఉచితరీతిని సమాధానమిచ్చారు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ కార్యదర్శిపదవిని చేపట్టి పాతూరి వారికి కొంతవిశ్రాంతిని కల్పించుటకు శ్రీ గద్దె రామమూర్తిగారు తాము సంసిద్ధులమని ప్రకటిస్తూ దీనికి చిహ్నంగా వారొక చేతికర్రను పాతూరి వారికి బహూకరించారు శరణాలయ విద్యార్థిని శ్రీమతి వి ఝాన్సీరాణి వందన సమర్పణ, జాతీయ గీతాలాపంతో కార్యక్రమం ముచ్చటగా ముగిసినది

Regd. No H/Rmy-42. Samalochana 1, September 1979

# 1979-80 బి. వి. అండ్ కో., వారి ప్రచురణములు

## Telugu Five Pandits Notes

### Intermediate

| | | |
|---|---|---|
| I Year | గద్యభాగము నోట్సు | రు. 6 - 50 |
| ,, | ఉపవాచకము నరమేధము నోట్సు | రు. 8 - 00 |
| II Year | పద్యభాగము నోట్సు | రు. 8 - 50 |
| ,, | నాటకము అశ్వత్థామ నోట్సు | రు. 8 - 00 |

## ENGLISH

| | | |
|---|---|---|
| I Year | English Notes (Prose & Poetry) | రు. 7 - 50 |
| ,, | Select short stories (Nondetailed) | రు. 1 - 50 |
| II Year | English Notes (Prose & Poetry) | రు. 6 - 75 |
| ,, | Tales from Home and Abroad (Nondetailed) | రు. 1 - 50 |

## డిగ్రీ తరగతులు

| | |
|---|---|
| B. Com II Year Telugu Notes (Old Poetry with text) | రు. 7 - 00 |
| B A II Year Telugu Notes (Old Poetry with text) | రు. 7 - 00 |
| ప్రతిమ B Com. II Year నాటకము నోట్సు | రు. 8 - 00 |
| బలరామ విజయము ,, | రు 8 - 00 |
| స్వప్నవాసవదత్తము, సుభద్ర B A II Year నాటకము నోట్సు | రు. 6 - 00 |

I Year Degree Telugu Notes అతిత్వరలో ప్రచురింపబడును.

For Copies :—

*Publishers :*

**B. V. & CO.,**

6-8-7, Innispeta, RAJAHMUNDRY-1.